శ్రీరామ

# కాలనిర్ణయం బోధిని



- శ్రీమాన్ కోవిల్ కందాడై వేంకట సుందరాచార్యులు




ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# శ్రీరామకాలనిర్ణయబోధిని.



ఇది

శ్రీమాన్ శ్రీ కోవిల్ కందాడై

వేంకట సుందరాచార్యులయ్యవారులుంగారిచే

రచింపఁబడినది.







చెన్నపట్టణము

ఆనందముద్రాయంత్రాలయాధికారులగు

ఆర్. వేంకటేశ్వర కంపెనివారివలనఁ

ప్రకటింపఁబడినది.

1913.

దీని వెల.]  [౦-౮-౦.

# ఉపోద్ఘాతము.



శ్రియఃపతియు, శ్రీవైకుంఠనికేతనుఁడును, నిత్యముక్తానుభావ్యుండును, నిరతిశయానందయుక్తుండును, సర్వజనమోక్షప్రదుండు నగు శ్రీమన్నారాయణుని విభవావతారంబగు శ్రీరామచంద్రుని మహిమల ననేకు లనేకవిధముల విరచించిరి. అందుముందుగ రచితంబయినదియు, కావ్యంబుల కాదిమకావ్యంబైనదియు, నవరసభరితంబైనదియు వాల్మీకంబు. దానిని బ్రధానంబుగా గ్రహించి కొందఱును, పురాణేతరంబులనుండు గాథలనందుకొని రామకథకు సందర్భింపఁజేసి మఱికొందఱును, రామాయణంబు లను పేరట కథాబాహుళ్యముఁ బెంచి వారివారిచిత్తవృత్తుల ననుసరించిన గ్రంథములు రచించియుండిరి. నేనీగ్రంథమును రచింపఁబూని యీమహాపురుషమహిమాభివర్ణితంబులగు ననేకగ్రంథములను జూచితినిగాని శ్రీరామమహిమార్ణవంబనదగు వాల్మీకమునకంటె నధికరుచికరంబై యకళంకముగ నవతారచరితమును దెలుపు గ్రంథమింకొకటి కలదనితలంప నవకాశమించుకయుఁ గలుగలేదు. కనుక నే వ్రాయఁబూనిన యీరామాయణకాలనిర్ణయబోధినికి వాల్మీకమునె ప్రమాణంబుగఁగొని దానికనుగుణంబులగు శ్లోకరత్నంబుల నామహార్ణవంబును దఱచిచేకొని యామహాపురుషునికాలనిర్ణయంబు నిందు వివరించితిని. కొందఱీగ్రంథమువలన నేమిప్రయోజనంబని తలంతురు. పలువురయభిప్రాయంబులు పలుతెఱంగులఁ జెలంగుఁగాని యొక్కగతి నేకీభవించుట యరుదు. ఒరులయభిప్రాయంబుల నందుకొని వారివారియుద్దేశముల ననుసరించి గమనించుటకుఁ గవికిని సాధ్యంబు గాదు. రామాయణాదిగ్రంథంబుల నెన్నిటిని జదివినఁ జదువరులు ప్రధానంబుగాఁ దెలిసికొనఁదగిన శ్రీరామజననము, శూర్పణఖాదుల పరిభవంబును, రావణవధయు, నింక నేకాలమందెచ్చోట నేయేవైభవంబులను నడపిరో యాయావివరములను దెలిసికొనుట కాయాగ్రంథంబులు సూక్ష్మబోధకంబులు గావనుట యందఱికిని తెలిసినయంశమే. పైవిషయములను గుఱించి నిరంతరరామకథాహ్లాదులై రామాయణాదిగ్రంథములను బఠించువారి నెవరడిగిన వారనుమానించి యాయావిషయంబులు పరిశీలించి చెప్పవలసినవని పుస్తకాపేక్షను గోరుచు వారిని తృప్తిపఱచుట కాని విస్పష్టముగ కాలనిర్ణయంబు చేయుటకు సంకోచించుచుందురు. కనుక నీగ్రంథమును బరిశీలించిన సర్వజనులు నట్టిసంకోచమించుకయు లేకయే శ్రీరామావతారకాలనిర్ణయంబును దెలిసికొని యానందింతురని దీనిని రచించితిని. నేనిందులకై చేసినకృషి నేస్తవంబుగాఁ గొ

నుట యనుచితంబుగాన నదిచదువరులె గ్రహింపవలయునని వారికివిడిచితిని. మఱియు దీనిని నే రచించుకాలమున శ్రీరామాయణకాలనిర్ణయప్రకాశిక యని నామకరణంబు చేయుటవలన నీగ్రంథమునుచూచినపండితోత్తములు తా మిచ్చినయభిప్రాయంబు లానామముననే యిచ్చిరి. పిదప నొకరు దీనికి శ్రీరామకాలనిర్ణయబోధిని యనుపేరి నుంచిన బాలబోధకంబని దీనిమీఁదనిచ్చువారి యభిప్రాయంబున నభివర్ణించుటచే సుకరమని దానినే నేనీగ్రంథమునకు ముద్రాపణకాలంబున స్థిరపఱచితిని. ఆనామములు రెండును నేకార్థమునే విశదపఱచుచుండిన నియ్యది సుఖబోధకము గాన నిటుల నామకరణ మొనర్చుటకుఁ గారణము.

విద్వజ్జనవిధేయుఁడు,
శ్రీవేంకట సుందరాచార్యస్వామి,
గ్రంథకర్త.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీరామకాలనిర్ణయబోధిని.

## బాలకాండము.



శ్లో॥ రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

శ్రీరాముఁడు పరంధాముఁ డనియు, సీత లోకమాత యనియు, భరతుఁడు నిఖిలజనరక్షణదీక్షాదక్షవైరివిక్రమహారశ్రీచక్ర మనియు, లక్ష్మణుఁడు త్రివిధాసదృశకైంకర్యగుణలక్షణుఁ డగుననంతుఁడనియు, శత్రుఘ్నుఁడు నిజధ్యానధ్వస్తపాతకసంచయం బగుపాంచజన్య మనియుఁ, దమతమ గుణానురూప నామములం గొనియాడఁబడియెదరు. జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజము లనునాఱుగుణంబులం బరిపూర్ణుం డగునారాయణుం డీతెఱంగునం దనచే సృజింపఁబడినయిజ్జగంబున నెటనో యొకగ్రామమున నొకనరునికిం దా సుతుఁడై పరివారము సందడ పొందుపఱచి యవతరించుటం జూఁడ నభాగ్యులగుచేతనుల సభాగ్యులఁగఁ జేయుటకే! కాని యో! సర్వమంగళస్వరూపునకు నీనరజన్మ మేల? ఘోరారణ్యసంచరణ మేల? ఈ పత్నీహరణజనితదుఃఖ మేల? స్వభావచపలమర్కటరాజాశ్రయణాదు లేల? ఇట్టియాపదల వినినంతనె యాపాదమస్తకము గగుర్పొడిచి పగఱకైన నిట్టియిక్కట్టు రాఁగూడదని తోఁచుఁగద! ఇఁక నట్టిజగదవనదీక్షాబద్ధకంకణుఁ డగుమన కథానాయకునిపట్ల నుడువఁబని లేదు. భారతరామాయణము లనురెండుగ్రంథము లితిహాసము లనంబడు. అందులో భారతము వర్తమానయుగ సన్నిహిత పూర్వయుగాంతమున జరగినటులు గన్పట్టు. శ్రీరామాయణము పంచమ త్రేతాయుగ చతుర్థభాగమునం జరగినటులు దెలివిడి యగు. ఇదియే యొకచిత్రము. మనచిఱుతందనమున నొనర్చినకర్జముల నెన్నటి మనకశక్యముగ నుండ నిరువదిమూఁడుమహాయుగములకుం బూర్వ మగుకథ నింకను బోనీయక కాపాడినందులకు మనపూర్వుల కెంతయు వందనములఁ జలుపంజను. ఇయ్యది యటు లుండనిండు. అనాది యగువేదమున కవిచ్ఛిన్నముగ ఘనజటాదుల నభ్యసింపఁ గలయతిశయ శేముషీకుల కిది యొక వింతయా? ప్రకృతమును ననుసరింతము. శ్రీరాముం డేసంవత్సరమున నవతరించెనో కొంచెము విచారింతము. కృత, త్రేతా, ద్వాపర, కలి లని యుగములు నలుదెఱంగులఁ బరఁగు. నాల్గింటిముత్త మొకమహాయుగ మనంబడు. డెబ్బదియొక్క మహా

యుగము లొక మన్వంతరము. ఆర్గురుమనువులకాలం బిదివఱకు గతం బయ్యె. ఇప్పు
డేడవది యగు వైవస్వత మన్వంతరమున నిరువదియెనిమిదవ మహాయుగము జరగు
చున్నయది. మన కథానాయకునిజనన మీమన్వంతరమున నైదవమహాయుగము
నం గడచిన త్రేతాయుగమున నాల్గవభాగమున ముప్పదివేలసంవత్సరము లుండు
తఱి విలంబిసంవత్సర చైత్రశుద్ధ నవమీ సౌమ్యవాసరమున మధ్యాహ్నము కర్క
టకలగ్నమున నవతరించెనని కబ్బములఁ గన్పట్టు. [1] గర్భము ధరించినపండ్రెండవమా
స మగుచైత్రమున శుక్లపక్షనవమీ పునర్వసు నక్షత్రమున మధ్యాహ్నము కటక
లగ్నమున గురుచంద్రయోగమున నైదుగ్రహంబు లుచ్చస్థితి నుండుసమయమునఁ
గౌసల్య రాముని గనియె. [2] ప్రమాది, ఖర, శోభకృత్, రాక్షస, ప్రభవ, సంవత్స
రములందు ధనుస్సున గురుఁడుండిన కుంభ, కర్కటక, ధను, మేష, కన్యా, రాసు
లను శనియుండు. కాన ఖర సంవత్సరమున ధనుస్సున గురుఁడుండఁగఁ గటకమున
శని యుండును. తదాదిగ నెనిమిదవది యగు విలంబి సంవత్సరమున కర్కటకమున
గురుఁడుండి తులయందు శని యుండెను. కాన జననము విలంబియనుట నిజము.
పంచగ్రహోచ్చ యనునది గణితమార్గమున సాధింపఁదగు నంశముగాన దానినిందుఁ
గనఁబఱచిన నది సుఖబోధకంబుగాక చదువరుల కగమ్యగోచరముగ నుండనోపునని
విరమించితిని. ఇట్టిగ్రహసంపత్తి గలచైత్రమాసమున శుక్లపక్షనవమిని, పునర్వసు
నక్షత్రయుత మగుమధ్యాహ్నకాలమున, కర్కటకలగ్నమున గురుచంద్రయోగము
పంచగ్రహోచ్చ మొదలగువిషయము లన్నియు నావిలంబిసంవత్సరమునఁ గలిగి
యుండియు నితరసమయమున లేకుండుటనుబట్టి చూడ నయ్యదియే జననసమయ
మని నుడువవలసివచ్చె. ఇక్ష్వాకుఁడు భగవంతునికొఱకుఁ దపంబొనర్ప [3] నీచే నారా
ధింపఁబడు నేను రఘువంశజులకు రాజధాని యగునయోధ్యకుం జనఁ గోర్కెగలదని
యు వార లచటనన్నుఁ జతుర్యుగ చతుష్టయకాలముం బూజింపఁ జోళదేశమునఁ
గావేరీతట పరిసర చంద్రపుష్కరిణీ తీరమున శయనింపంగల ననియుఁ బితామహు
నకు శ్రీరంగనాథుఁడు దెలుప నాతఁడు శ్రీరంగధామము నిక్ష్వాకునకు సమర్పించు

(1) 1-18-8 శ్లో॥ తతశ్చ ద్వాదశేమాసే చైత్రేనావమికేతిథౌ। నక్షత్రేఽదితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు ॥ గ్రహేషుకర్కటేలగ్నే వాక్పతావిందునాసహ। ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతం॥ కౌసల్యా జనయద్రామం సర్వలక్షణసంయుతం। విష్ణోరర్ధ మ్మహాభాగ మిక్ష్వాకుకులనందనమ్ ॥

(2) కాలప్రకాశికాయాం॥ ప్రమాదిఖరశోభకృద్రాక్షసప్రభవేషుచ। ధనుర్గురుః ప్రమాద్యాదివర్షాణాంతు యథాక్రమాత్ ॥ కుంభికర్కిధనుర్మేష కన్యారాశౌ శనిః క్రమాత్ ॥

(3) శ్రీరంగమాహాత్మ్యే॥ శ్రీభగవానువాచ॥ త్వయార్చితోఽహమధునా శ్రీరంగేధామ్నిపద్మజ॥ అయోధ్యాం గంతుమిచ్ఛామి రఘుభిఃపరిపాలితామ్॥ తే మాం తత్రార్చయిష్యంతి చతుర్యుగచతుష్టయమ్॥ తతఃపరం ప్రయాస్యామి కావేరీం చోళరక్షితాం। చంద్రపుష్కరిణీతీరే శయిష్యేహంచతుర్ముఖ॥

టయుఁ [1] బుత్రపౌత్రయుతుండై ఫాల్గుణశుద్ధ పూర్ణిమా ఫల్గునీనక్షత్రమున నుత్సవముల నతండు జరపుటయు నటులు జరగుచునుండ [2] నైదవత్రేతాయుగమునఁ బుత్రార్థియై దశరథుఁడు హయమేధ మొనర్చెననియుం గలదు. కాన నైదవ మహాయుగాంతర్గత త్రేతాయుగమునం దీయనయవతార మని నిర్ణయింపఁదగును. [3] తదనంతరము, రవి మీనమందుండ వసంతర్తువున రోహిణీనక్షత్ర భద్రాకరణ మందవాసరమున నుషఃకాలమున నిక్ష్వాకుకులధన మగుశ్రీరంగధామమును ధ్వజసహితముగఁ బ్రియుం డగువిభీషణునకు శ్రీరాముఁ డొసంగె. [4] ఇక్ష్వాకుకులధనమును బొంది లంకకుం జనునెడఁ జోళదేశమునఁ గావేరీతీరమున నతండు (శ్రీరంగనాథుఁడు) శయనించె. కాన పంచమ త్రేతాయుగ చతుర్థభాగమున విలంబిసంవత్సర చైత్రశుద్ధ నవమి శ్రీరామజనన మనియు వనవాసాంతమున నన ధాతృసంవత్సర చైత్రశుద్ధ సప్తమీ గురువార పుష్యమీనక్షత్రమునఁ బట్టాభిషేకంబు జరగం దదుత్సవావలోకనాగతుఁ డగువిభీషణునకు నామాసాంత మమావాస్యా రోహిణీనక్షత్ర భద్రాకరణ మందవాసరమున నుషఃకాలమున విభీషణునకు దయచేయుటయు నను నంశములు స్థిరపడినవి. ఇఁకఁ బాయసవిభాగవిషయము విచారింతము. [5] దశరథుఁడు కౌసల్యకుఁ బాయసమునం దర్ధమిచ్చె. కైకేయికి మిగిలినసగము నిచ్చె. అమృతతుల్య మగుపాయసమున నామిగిలిన సగము వెండియు సుమిత్ర కిచ్చెనని యున్నది. ఇటు లర్థ మొనర్చినఁ బరస్పర విరోధము లుప్పతిల్లు. [6] ప్రత్యక్షముగ విష్ణుచతుర్భాగము భరతుఁడనియు, సుమిత్రాపుత్రు లగులక్ష్మణశత్రుఘ్ను లిరువురు విష్ణ్వర్ధభాగ మనియుం గలదు. కాన తదనుగుణ్యముగ నర్థముం జేయవలయు. అనఁగఁ గౌసల్యకు సగభాగమును సుమిత్రకు సగములో సగము (నాల్గవభాగమును,) కైకేయికి మిగిలినసగమును నీయఁ బాయసము తుదముట్టును. శత్రుఘ్నజనన కారణ మగుపాయస ముండదు. కాన యొకవిరోధము. కౌసల్యకు సగభాగమును సుమి

---

(1) ఫాల్గునేమాసి దేవస్య నక్షత్రే భగదైవతే। ఉత్సవావభృథంచక్రే పుత్రపౌత్రైస్సమన్వితః॥ (2) త్రేతాయుగే పంచమే తు రాజా దశరథోఽనఘః। పుత్రార్థం హయమేధేన యష్టుం సముపచక్రమే॥ (3) అథమీనరవౌ మాసే వసంతర్తౌ శుభాన్వితే। ప్రాజాపత్యే చ నక్షత్రే భద్రాయాం మందవాసరే॥ ఉషఃకాలే శుభే లగ్నే రామేణాక్లిష్టకర్మణా। ఇక్ష్వాకూణాం కులధన మాత్మనోఽభ్యధికం తదా॥ శ్రీమద్రంగం మహద్ధామ సధ్వజం సపరిచ్ఛదం। విభీషణాయ దత్తంస్యాత్ప్రియాయ ప్రియకారిణే॥ (4) 6-131-91 లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయాద్విభీషణః॥ (5) 1-17-30 కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా। అర్ధాదర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః। కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్। ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమమ్॥ అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః। (6) 1-18-13 భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః। సాక్షాద్విష్ణోశ్చతుర్భాగ స్సర్వైస్సముదితో గుణైః॥ అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాజనయత్సుతౌ। వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణోరర్ధసమన్వితౌ॥

త్రకు సగములో సగము (నాల్గవభాగము)ను నీయ, మిగిలిననాల్గవభాగము రెండుగ విభజించి కైకేయికి నొకభాగమును సుమిత్రకు నొకభాగమును, నిచ్చెనని నుడివిన లక్ష్మణశత్రుఘ్ను లిరువురుం గలసి విష్ణ్వర్ధభాగ మనుటకు విరోధము. భరతుం డష్టమాంశజనితుఁ డనినఁ బ్రత్యక్షముగ విష్ణువున నాల్గవభాగము సను దానికి విరోధము. కాన శ్రీరాముండు పాయసార్ధభాగజనితుఁ డనియు భరతుఁడు పాదభాగజనితుఁ డనియు, లక్ష్మణశత్రుఘ్ను లిరువురుం గలసి పాదభాగజనితు లనియు నుడువవలెను. ఇంతియకాక వీరలజననక్షత్రముల విచారించియు, యౌవరాజ్యార్హతను గమనించియు, పాయసభాగమునకును వయసునకును భరతుఁడే పెద్ద. ఎటు లనిన పునర్వసు నక్షత్రమున శ్రీరామమూర్తిజననమును, [1] పుష్యమీనక్షత్రమున భరతునిజననమును, నాశ్లేషానక్షత్రమున లక్ష్మణశత్రుఘ్ను లిరువురజననమును. కాఁబట్టి యీవిషయముచేతను భరతుఁడు పెద్దయే యగు. కావుననే యౌవరాజ్యార్హతయుం గూడ నితనిదే. అనంతర ముపనయనాదికర్మకాలమును విచారింతము. [2]జననాది పదునొకండుదినంబు లయినపిదప దశరథుఁడు పుత్రులకుం బుణ్యాహాదికర్మముల నొనర్చి జ్యేష్ఠునకు రాముఁ డనియు, కైకయీసుతునకు భరతుఁ డనియు, సుమిత్రాసుతులలో జ్యేష్ఠునకు లక్ష్మణుఁ డనియు, కనిష్ఠునకు శత్రుఘ్నుఁ డనియు, వసిష్ఠుఁడు నామముల నిడె. అనంతరము దినదినప్రవర్ధమాను లగుసుతులం గాంచి [3] సర్వకర్మములను జరపెనన నుపనయనపర్యంతము గలకర్మముల నాచరించెనని యెంచవలయు. [4] గర్భసంఖ్యయుఁ గలసి పదునొకండువత్సరములలోపల క్షత్రియున కుపనయనకాలనిర్ణయము గాన "ఏకాదశేషు" అను బహువచనార్థము మూఁడుసంఖ్యలు గ గ్రహించి గర్భనవమ గర్భదశమ గర్భైకాదశము లని స్థిరపఱుప జననానంతర మెనిమిది తొమ్మిది పదిసంవత్సరములుగ నేర్పడినను మొదటి దగు నెనిమిదవసంవత్సర మే ముఖ్యముగఁ బరిగణింపఁ బడుటం జేసి యీసమయమున నుపనయనం బని నుడువం దగు. ఇంతియకాక వనప్రయాణసమయమున [5] శ్రీరామునకుఁ బదునేడవయేఁటను కౌసల్యాదేవివాక్యము నెంచ నుపనయనప్రయుక్తద్వితీయజననాది గ నుండును. [6] లేనిచో తనభర్త కిరువదియైదువత్సరములవయ సనియు తనకుం బదునెనిమిదివత్సరము లనియు సీత నుడివినయంశమునకు విరోధముగ నుండును. దానిచే నుపన

---

(1) పుష్యేజాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః। సార్పేజాతౌతు సౌమిత్రీ కుళీరేభ్యుదితేరవౌ॥
(2) 1-18-20 అతీత్యైకాదశాహంతు నామకర్మ తథాకరోత్ । జ్యేష్ఠంరామంమహాత్మానం భరతం కైకయీసుతమ్॥ సౌమిత్రిం లక్ష్మణమితి శత్రుఘ్నమపరంతథా ॥ వసిష్ఠః పరమప్రీతో నామానికృతవాంస్తదా ॥ (3) 1-18-22½ తేషాంజన్మక్రియాదీని సర్వకర్మాణ్యకారయత్ ॥ (4) ఆ॥ సూ॥ గర్భైకాదశేషురాజన్యమ్॥ (5) 2-20-45 దశసప్తచవర్షాణి తవజాతస్యరాఘవ. (6) 3-47-10 మమభర్తా మహాతేజా వయసా పంచవింశకః ॥ అష్టాదశహి వర్షాణి మమజన్మని గణ్యతే ॥

యన మెనిమిదవసంవత్సరమున ననియే నిశ్చయింపవలయు. [1] తలిదండ్రులవలనఁ గలిగినది మొదటిజన్మ మనియుఁ బిదప మౌంజీబంధనమున రెండవజన్మము గలుగు ననియు దీనం దండ్రి యాచార్యుఁ డనియు, దల్లి సావిత్రి యనియుం గలదు. [2] తదనంతరము వేదములం జదువుటయు విలువిద్య నేర్చుటయు గజాశ్వరథారోహణాదిచతుష్షష్టివిద్యలం గడతేఱి యుండుపుత్త్రులం గాంచి [3] యుపాధ్యాయబంధుమిత్త్రామాత్యులం గూడి దశరథుం డుద్వాహచింతం జేయునెడ, [4] నగాధమహిమార్ణవుఁ డగు గాధిసూనుఁ డేతెంచి రాజదర్శన మొనర్చి యట సపర్యలంగొని సంతసించి విశ్రమించియుండుతఱి [5] పంక్తిరథుఁడు కోరినకోర్కె నిచ్చెద నడుగుమని యాఋషికిం జెప్పఁ బ్రహ్మర్షివదనుఁడై యతండు [6] యజ్ఞదీక్ష వహించెదననియు, తద్భంగముల నొనర్చునిద్దఱురక్కసుల నుక్కడంప రామలక్ష్మణుల నంపిన నిర్విఘ్నముగ సద్దానిం గడపి వెండియు నిటఁ దోడ్కొని రాఁగల ననియు నుడువ నతిప్రయత్నలబ్ధపుత్త్రుల నంప నిష్టము లేమిని [7] గమలలోచనుం డగు రాముండు పదియాఱువత్సరములవయసునకు లోఁబడి క్షీరకంఠుఁ డగువాఁడు గాన రక్కసులతోఁ బోరాడుట కీయనకు యోగ్యతఁ గానమని నుడివె. ఎంతవయసు గలవాఁడుగ నుండునని విచారణచేయ, [8] మారీచవాక్యమునఁ బండ్రెండువత్సరము లని స్పష్టమగుచున్నయది. [9] వనవాససమయ మిరువదియైదవయేఁ డనియు, [10] తత్పూర్వమునఁ బదిరెండుసంవత్సరము లత్తవారింటఁ దా నుండెననియు సీతవాక్యము గలదు కాన పండ్రెండుసంవత్సరములు నిండువఱ కీయనకు వివాహ మగుటయు ననంతరమునఁ బదురెండువత్సరము లయోధ్య నుండుటయుం గలసి యిరువదినాల్గువత్సరములు ముగియును. ఇరువదియైదవవత్సర ప్రారంభము వనవాసమే యగును. కాన వివాహాత్పూర్వ మహల్యాశాపమోచన యజ్ఞరక్షణ తాటకావధాదికార్యములు జరగుటయును, మాఘమాసమున యజ్ఞారంభమునకుం బ్రశస్తమాస మగుటను శోణానదీతీరమున శ్రీరామలక్ష్మణులు విశ్వామిత్త్రునితోడం గలసి యుండునెడ నపరరాత్త్రమున చంద్రోదయవర్ణనను జేయుటచే నది యపరపక్షమని నిర్ణయించుచు, తత్పూర్వము యజ్ఞరక్షణతాటకావధాదులను,

---

(1) యోగయాజ్ఞవల్క్యః॥ మాతర్యదగ్రేజాయంతే ద్వితీయంమౌంజిబంధనాత్ । తత్రాస్య మాతాసావిత్రీ పితాత్వాచార్యఉచ్యతే॥ బ్రాహ్మణక్షత్రియవిశ స్తస్మాదేతేద్విజాతయః॥ (2) 1-18-35 తేచాపి మనుజవ్యాఘ్రా వైదికాధ్యయనేరతాః। పితృశుశ్రూషణరతాః ధనుర్వేదేచనిష్ఠితాః ॥ (3) అథరాజాదశరథ స్తేషాందారక్రియాంప్రతి। చిన్తయామాస ధర్మాత్మా సోపాధ్యాయ స్సబాంధవః ॥ (4) అభ్యాగచ్ఛ న్మహాతేజా విశ్వామిత్రోమహామునిః॥ (5) 1-18-51 కంచతేపరమంకామంకరోమి కిముహర్షితః॥ (6) 1-19-4 అహంనియమమాతిష్ఠే సిద్ధ్యర్థంపురుషర్షభ। తస్యవిఘ్నకరౌద్వౌతు రాక్షసౌకామరూపిణౌ ॥ (7) 1-20-2 ఊనషోడశవర్షోమే రామోరాజీవలోచనః ॥ నయుద్ధయోగ్యతామస్య పశ్యామి సహరాక్షసైః॥ (8) 3-38-6 బాలోద్వాదశవర్షోయమకృతాస్త్రశ్చ రాఘవః॥ (9) 3-47-9½ మమభర్తామహాతేజా వయసాపంచవింశకః॥ (10) 3-47-4 ఉషిత్వాద్వాదశసమాః । ఇక్ష్వాకూణాం నివేశనే॥

తత్పరమున నహల్యాశాపమోచన సీతావివాహాది కృత్యములను సాకల్యముగ గణింప నేఁబదిమూఁడుదినములు తక్కువ పండ్రెండువత్సరములవయసున విశ్వామిత్రయజ్ఞరక్షణంబు సేయ రామలక్ష్మణు లిరువురును బంపఁబడిరి. ఎటులనిన విలంబిసంవత్సర చైత్రశుక్ల నవమియం దవతరించినశ్రీరామచంద్రునకు సాధారణసంవత్సర చైత్రశుక్ల నవమీపర్యంతము పండ్రెండుసంవత్సరములవయ సగును. సౌమ్యసంవత్సర మాఘబహుళ ద్వితీయకు శ్రీరామునికిఁ బదునొకండు వత్సరముల పదిమాసముల యెనిమిదిదినములు. ఆదినము నుదయమున విశ్వామిత్రునితో శ్రీరామలక్ష్మణులు బయలుదేఱుటయు విశ్వామిత్రునివలన వారు బలాతిబల లనువిద్యలఁ గొనుటయు, [1]నాసాయంతనమున సరయూతీరవాసమును [2]మఱునాఁ డుదయమున (బహుళతృతీయ)న చ్చోటువిడిచి కామాశ్రమమునకుం జని యాదినమంతయు గంగాసరయూసఙ్గమప్రదేశమునఁ గాలంబు గడపుటయు [3] నామఱునాఁ (బ 4) డుదయమున నదినిదాఁటి తాటకావనమునకుం జని యారేయి యచ్చోటనే కడపి తద్వధయుం గావించి [4] మఱుదినము (బ 5) దయమునఁ గౌశికుం డతిముదమున నస్త్రముల నుపదేశింప నటనన్నియుంగొని సిద్ధాశ్రమప్రవేశ మొనర్చి ఋషులం గాంచి నమస్కరింప వారందఱమందానందకందళితహృదయు లై యుండునెడఁ, గుశికసుతుండు యజ్ఞదీక్ష వహించి నేఁడు మొదలాఱహోరాత్రము లప్రమత్తులై రక్షయొనర్పుఁడని నుడివి మౌనమువహింప నాతెఱఁగున [5] నాఱహోరాత్రములు (పంచమి మొదలు దశమ్యంతము) యజ్ఞరక్షం గావించి కృతకృత్యు లై ఋషులచే నాశీర్వచనములం బొంది యారేయి నచటఁ గడపి మఱుదినము (ఏకాదశి) నుదయమున ఋషులచే ననుజ్ఞాతులై విశ్వామిత్రునిఁ గూడి నడచుచు శోణాకూలమున నారేయి గడపుతఱిఁ గుశనాభాదులచరితంబు నుడువ నంత [6] నర్ధరాత్రము గతించె. [7] దిశలెల్లం దమము నిండి యున్నయది; తరుజాలములుఁ జలింపక యున్నవి; యనుచు [8]లోకంబునఁ జీఁకటిని వెడలఁగొట్టు శీతాంశూదయ మగుచున్నయది యని నుడివిన [9] యనంతరమందఱు నిద్రింగూరిరి. ఆమఱుదిన (ద్వాదశి) ముదయానంతరము కాల్యకృత్యములం జరపి గమనోన్ముఖు లై చని చని [10] మధ్యాహ్నసమయమునకుం

(1) 1-22-23½ ఊషుస్తాంరజనీంతీరేసరయ్వాస్సుసుఖంత్రయః ॥ (2) 1-23-21 న్యవసన్సుసుఖం తత్రకామాశ్రమపదేతదా ॥ (3) 1-26-36½ ఉవాసరజనీంతత్ర తాటకాయావనేసుఖమ్ ॥

(4) 1-28-1 ప్రతిగృహ్యతతోస్త్రాణి ప్రహృష్టవదనశ్శుచిః ॥ (5) 1-30-5 అనిద్రాషడహోరాత్రం తపోవన మరక్షతామ్ ॥

(6) 1-34-1½ గతోర్ధరాత్రిః కాకుత్స్థకథాః కథయతోమమ. (7) 4½ నిష్పందాస్తరవస్సర్వే నిలీనామృగపక్షిణః। నైశేనతమసా వ్యాప్తా దిశశ్చ రఘునందన॥ (8) 16½ ఉత్తిష్ఠతిచశీతాంశుశ్శశీలోక తమోనుదః॥ (9) 1-35-1 ఉపాస్యరాత్రి శేషంతు శోణాకూలేమహర్షిభిః॥ (10) 1-35-7 తేగత్వాదూరమధ్వానం గతేర్ధదివసేతదా । జాహ్నవీంసరితాం శ్రేష్ఠాం దదృశుర్మునిసేవితామ్ ॥

గంగాతీరముఁ జేరి స్నానతర్పణాదులను జరపి విశ్వామిత్రుని గంగాచరితమంతయు నుడువు మన నాతండు వల్లె యని యారంభ మొనర్చి సగరునిచరితమును నుడువ *a* నా రేయి యట గతించె. ఆమఱునాటిదిన (బ 13) ముదయమున *b* నిత్యకృత్యములం జరపి విశాలాపట్టణముం జేరి యాస్థలపాలకులవృత్తాంతంబు విశ్వామిత్రుండు నుడువను నచటనే *c* యారాత్రి యంతయుం గడిపిరి. అనంతరదినము నుదయమున (బ 14) మిథిలాపట్టణముఁ జేరి *d* తత్సమీపమున రమ్యమై నిర్జనముగ నుండునాశ్రమముం గని యిట్టులుండుటకుం గతంబేమి యని రాముం డడుగ నహల్యావృత్తాంత మంతయు నాతఁడుదెల్ప నచటికిం జని శాపాంతమున నామెచే నాతిథ్యాదులం గొని *e* యీశాన్యదిక్కునకుం జని యజ్ఞవాటమును జేరి జనకునిచే నర్ఘ్యాదులను గొని యాసీనులైనతఱి నాతం డీరాజపుత్రు లెవరని ప్రశ్నింపఁ దెలిసి స్వాగతకార్యమును నుడువ నింతనే శతానందున కీఋషికి జరుగుసంభాషణలచే సాయంతనమగుడుఁ *f* గర్మకాలమాగాన నెల్లిదర్శన మిందని జనకుఁడు నుడువఁ జని *g* మఱునాఁడు (అనునస) ముదయమున సంధ్యాదికృత్యములం దీర్చి యుపవిష్టుఁ డగు జనకునిం గాంచి యతనియాజ్ఞ చేనటఁ గొని తెచ్చిన *h* ధనుస్సును నెక్కిడునమయమున నది విఱిగిపోవం జూచి సంతస మినుమడింప *i* వీర్యశుల్కయు నయోనిజయునగు సీత శ్రీరాముని భర్తగఁ గైకొని *j* జనకవంశమునకుఁ గీర్తిఁ దేఁగలదని నుడివి *k* యయోధ్యకు (ఫాల్గున శు 3) దూతలనంపె. వారలు *l* త్రిరాత్రము మార్గమధ్యమునఁ గడపి (శు 6) యయోధ్యంజేరి దశరథున కీవార్త నెఱింగింప నతిముదమున *m* నామఱుదినము (శు 7) న బంధుమిత్రపురోహితామాత్యసహితుఁడై చతురంగబలము వెంటనంటిరాఁ బ్రయాణమొనర్చి *n* నాల్గుపవళ్ళు మార్గముననడచి మిథిలకు చాదశియుదయమునఁ జేరిరి. అంత జనకుండు మితపరివారుఁడై యెదుర్కొని పూజా

---

*a* 1-35-9 తస్యాస్తీరే తతశ్చక్రుస్త ఆవాసపరిగ్రహం॥ *b* 1-45-10 తతో మునివరస్తూర్ణం జగామ సహరాఘవః । విశాలాం నగరీం దివ్యాం రమ్యాం స్వర్గోపమాం తదా ॥ *c* 1-48-9½ ఉష్య తత్ర నిశామేకాం జగ్మతుర్మిథిలాం తతః॥ *d* 1-48-11 మిథిలోపవనే తత్ర ఆశ్రమం దృశ్య రాఘవః । పురాణం నిర్జనం రమ్యం పప్రచ్ఛ మునిపుంగవం॥ *e* 1-50-1 తతః ప్రాగుత్తరాం గత్వా రామస్సౌమిత్రిణా సహ। విశ్వామిత్రం పురస్కృత్య యజ్ఞవాట ముపాగమత్ ॥ *f* 1-65-3 కర్మకాలం మునిశ్రేష్ఠ లంబతే రవిమండలం । శ్వః ప్రభాతే మహాతేజ ద్రష్టుమర్హసి మాం పునః॥ *g* 1-66-1 తతః ప్రభాతే విమలే కృతకర్మా నరాధిపః॥ *h* 1-67-17 ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాస తద్ధనుః ॥ తద్బభంజ ధనుర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః॥ *i* 1-66-15 వీర్యశుల్కేతి మే కన్యా స్థాపితేయ మయోనిజా॥ *j* 1-67-22 జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా। సీతా భర్తారమాసాద్య రామం దశరథాత్మజమ్॥ *k* 1-67-27 అయోధ్యాం ప్రేషయామాస ధర్మాత్మా కృతశాసనాత్ ॥ *l* 1-68-1 త్రిరాత్రముషితా మార్గే తేఽయోధ్యాం ప్రావిశన్ పురీమ్॥ *m* 1-68-20 సుప్రీతశ్చాబ్రవీద్రాజా శ్వో యాత్రేతి సమంత్రిణః॥ *n* 1-69-6 గత్వా చతురహం మార్గం విదేహానభ్యుపేయివాన్ ॥

దులను జరపి *a* యజ్ఞాంతమున వివాహ మొనర్చుట ఋషిసమ్మతము గాన కొదువకార్యముల *b* రేపుదయమున జరపుండని నుడివి వారినినొకచో విడియింప *c* నతిసంతసమున నారాత్రియుఁ గడచెను. *d* మఱియు నావలిదినమున (త్రయోదశి) పూర్వాహ్ణకృత్యములనొనర్చి జనకుఁడు పురోహితుం డగు శతానందునిఁ జూచి మదనుజునిఁ గుశధ్వజుని రావింప దూతలనంపుమనుటయు నాక్షణమె యతం డేఁగుదెంచిన యనంతరమున మంత్రిచేత దశరథుని రప్పింప నుభయపురోహితశ్రేష్ఠు లుభయవంశములం గొనియాడ సీతను రామునకును, నూర్మిళను లక్ష్మణునకును, ననుజుని దుహితలగు మాండవ్య, శ్రుతకీర్తి యనునిరువుర బాలికలను భరతశత్రుఘ్నులకు నీయనిశ్చయ మొనర్చి *"నేఁడు మఖానక్షత్రము నాందీశ్రాద్ధములజరపి రామలక్ష్మణులకు గోదానవ్రత మొనరించి నేఁటికిమూఁడవదినము (ఫల్గునీనక్షత్రము)న వివాహముఁ జేయు" మని నుడివె. §అనంతరము దశరథుఁడు విడిదికింజని యాదినమే నాందీశ్రాద్ధ మొనరించి మఱుదినమునుదయమునఁ (చతుర్దశి) బ్రాతఃకాలకృత్యము లొనర్చి గోదానవ్రతము జరపె. $ అంత నారాత్రియుంగడవ మఱుదిన (పౌర్ణమి) ముదయమునఁ గృతకృత్యుఁడై దశరథుఁడు ఋషిపురస్సరముగ యజ్ఞశాలకుఁ జని కృతకౌతుకమంగళు లగుపుత్రుల వసిష్ఠసకాశమున నునిచి యుండుతఱి జనకుం డేతెంచి ‡ శ్రీరామునిచే సీతాపాణిగ్రహణంబుగావించి లక్ష్మణ భరత శత్రుఘ్నుల నూర్మిళా, మాండవ్య, శ్రుతకీర్తులఁ బాణిగ్రహణ మొనర్పుఁడని నుడువ వారలునటు సేయ †దివమున దుందుభులుమ్రోయ నప్సరసలాడ గంధర్వులు పాడ నత్యద్భుతముగ ¶ నైదు దినములు (పౌర్ణమి మొదలు పంచమివఱకు) నుద్వాహంబు జరపి °గృహప్రవేశము విడిదిలో నొనర్చి యట మూఁడుదినములు (పంచమి మొదలు సప్తమ్యంతము) గడవ

*a* 1-69-13 యజ్ఞస్యాంతే నరశ్రేష్ఠ వివాహ మృషిసమ్మతమ్॥ *b* 1-69-12 శ్వః ప్రభాతే నరేంద్రేంద్ర నిర్వర్తయితుమర్హసి॥ *c* 1-69-17 హర్షేణ మహతా యుక్తా స్తాం రాత్రిమవసన్ సుఖమ్ ॥ *d* 1-70-1 తతః ప్రభాతే జనకః కృతకర్మా మహర్షిభిః। ఉవాచ వాక్యం వాక్యజ్ఞః శతానందం పురోహితమ్॥

* 1-71-23 రామలక్ష్మణయో రాజన్ గోదానం కారయస్వ హ। పితృకార్యం చ భద్రం తే తతో వైవాహికం కురు॥ మఖా హ్యద్య మహాబాహో తృతీయే దివసే ప్రభో। ఫల్గున్యా ముత్తరే రాజం స్తస్మిన్ వైవాహికం కురు॥ § 1-72-21 స గత్వా నిలయం రాజా శ్రాద్ధం కృత్వా విధానతః। ప్రభాతే కాల్య ముత్థాయ చక్రే గోదానమంగళమ్॥ $ 1-73-7 తత స్తాముషితో రాత్రిం సహ పుత్రై ర్మహాత్మభిః। ప్రభాతే పునరుత్థాయ కృత్వా కర్మాణి కర్మవిత్॥ ఋషీం స్తదా పురస్కృత్య యజ్ఞవాటముపాగమత్॥ ‡ 1-73-27 ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ। ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా॥ † 1-73-39 దివ్యదుందుభినిర్ఘోషైః గీతవాదిత్రనిస్వనైః। ననృతుశ్చాప్సరస్సంఘా గంధర్వాశ్చ జగుః కలమ్॥ వివాహే రఘుముఖ్యానాం తదద్భుతమివాభవత్॥ ¶ 1-73-37 యథోక్తేన తథా చక్రు ర్వివాహం విధిపూర్వకం। ° 2-73-41 అథోపకార్యాం జగ్ముస్తే సభార్యా రఘునందనాః॥

సప్తమిదినమున విశ్వామిత్రుఁడు వధూవరుల నాశీర్వదించి జనకదశరథులను గాంచి వారితోఁ బోయెదనని చెప్పి స్వస్థానమునకుం జనియె. తరువాత నవమిదినమున [2] జనకజకు విశేషముగ దాసదాసీగజాశ్వాభరణాదులు ననేకములు కన్యాధనముగ నీయఁగొనిన మఱుదినము (దశమి) [3] నయోధ్యకుం జనఁ బ్రయాణంబు సలుపునెడ నవశకునంబులం గని శంకించుసమయమున [4] భార్గవరాముం డేతెంచి [5] నీవలన నొక ధనువు విఱువంబడియె; [6] ఇపు డీవైష్ణవధనుస్సును నెక్కిడిన ద్వంద్వయుద్ధ మొనర్చెదనని నుడివి తనచాపము నీయ [7] నతిసులభముగ నెక్కిడ లజ్జితుఁడై [8] మహేంద్రపర్వతమున కరిగె. అనంతర మైదాఱుదినములు మార్గమున నడువ సాధారణ సం॥ చైత్రశుద్ధద్వితీయదినమున నయోధ్యం జేరి యందఱు సుఖముగ నుండిరి. అనంతరము మేనమామ యగుయుధాజిత్తుచేఁ బిలువంబడినవాఁడుగాన [9] శత్రుఘ్నసహితుఁ డగుభరతుఁడు నందిగ్రామమునకుం జనియె.

---

(I) అథరాత్ర్యాంవ్యతీతాయాం విశ్వామిత్రో మహామునిః। ఆపృచ్ఛ్యతౌచ రాజానౌ జగామోత్తరపర్వతమ్॥ (2) 1-74-4 అథరాజావిదేహానాం దదౌకన్యాధనంబహు॥ హస్త్యశ్వరథపాదాతం దివ్యరూపంస్వలంకృతమ్॥ దదౌకన్యాపితా తాసాం దాసీదాసమనుత్తమమ్॥(3)1-74-9 రాజాప్యయోధ్యాధిపతి స్సహపుత్రైర్మహాత్మభిః । గచ్ఛంతంతంనరవ్యాఘ్రం సర్షిసంఘమ్ సరాఘవమ్। ఘోరాస్స్మపక్షిణోవాచో వ్యాహరన్తితత స్తతః॥ (4) 1-74 18 దదర్శభీమసంకాశం జటామండలధారిణమ్। భార్గవంజామదగ్న్యంతం రాజారాజవిమర్దినమ్॥ (5) 1-75-2 తదద్భుతమచింత్యంచ భేదనంధనుష స్త్వయా। తచ్ఛ్రుత్వాహమనుప్రాప్తో ధనుర్గృహ్యాపరంశుభమ్॥ (6) 1-75-29 తదిదంవైష్ణవంరామ పితృపైతామహంమహత్॥ క్షత్రధర్మంపురస్కృత్య గృహ్ణీష్వధనురుత్తమమ్। యోజయస్వధనుశ్శ్రేష్ఠే శరం పరపురంజయమ్॥ యదిశక్నోషికాకుత్స్థ ద్వంద్వందాస్యామితేతతః॥(7) 1-76-4 ఇత్యుక్త్వారాఘవః క్రుద్ధో భార్గవస్యశరాసనమ్। శరంచప్రతిజగ్రాహ హస్తాల్లఘుపరాక్రమః॥ ఆరోప్యసధనూరామశ్శరం సజ్యంచకారహ॥ (8) 1-76-22 జామదగ్న్యోజగామాశుమహేంద్రంపర్వతోత్తమమ్॥ (9) 1-77-22 అభివాద్యగురుంరామం పరిష్వజ్యచలక్ష్మణమ్। గమనాయాభిచక్రామ శత్రుఘ్నసహిత స్తదా॥

బాలకాండము సమాప్తము.



# అయోధ్యాకాండము.



అప్రమేయతేజోవంతుఁడగు శ్రీరాముండు ద్వాదశవార్షికవయస్కుఁడుగ నుండుసమయమున సీతాకరగ్రహణ మొనర్చి [1]యనంతరము పండ్రెండుసంవత్సరములయోధ్యను గామోపభోగములం దేలుచుండం బదునూఁడవయేట నొకదినమున సామంతరాజులం బురజనులనందఱ రావించి దశరథుం డాస్థానమలంకరించి 'నేననేకవేలవత్సరములనుండియు నేకచ్ఛత్రాధిపత్యముగ రాజ్యంబునలుపుచు నేరికి బాధలం గలుగనీయకఁ గాపాడినసంగతి మీ కందఱకుం దెలిసినదే కద! జరాభారపీడితుఁడనగు నేను నాదుజ్యేష్ఠపుత్త్రుఁడగు శ్రీరామునిం బట్టంబుగట్టి విశ్రమమునొంద నెంచెదఁ గాన మీయభినివేశముల నుడువుం'డని యడుగ నందఱొక్కమొగి గృహీతాంజలులై 'శ్రీరామునిఁ బట్టాభిషిక్తునిం జేయుటయే మాకోరిక'యని నుడువ నంత వసిష్ఠాదులం బిలిచి '[2]వికసించినపుష్పముల నలరారువనముల సంపద్యుక్త మగు నీచైత్రముగాన శ్రీరామునిఁ బట్టాభిషిక్తునిం జేయ సర్వమును సిద్ధము చేయుఁ'డని యానతిచ్చి '[3]వలయువస్తుసంభారములం దెలుపుఁ' డన స్వర్ణరత్నౌషధీశుక్లమాల్యలాజాదులును 'శ్వేతచ్ఛత్రచామరధ్వజములు మున్నగుపరికరములు' నని నుడువ సిద్ధమొనర్చి మఱుదినము (దుందుభి సం॥ చైత్ర శు ౯) పుష్యమీనక్షత్రమున [4]సూర్యోదయానంతరము 'శ్రీరామభద్రుఁడు పట్టబద్ధుఁడగు' నని బంధుమిత్రామాత్యులకుం జెప్పి యంతఃపురంబునకుంజని కొమరుని రావించి 'భూరిదక్షిణల ననేకయజ్ఞముల నొనర్చి, దేవఋషిపితౄణములం దీర్చి వృద్ధుఁడనైతి. ఇఁక విశ్రాంతినొందవలయు. ఇంతియకాక యశుభములు గానంబడుచున్నయవి. జనులందఱు నిన్నధిపునిం జేయనిచ్ఛఁ

---

(1) **3-47-4** ఉషిత్వా ద్వాదశసమా। ఇక్ష్వాకూణాం నివేశనే।భుంజానామానుషాన్ భోగాన్। సర్వకామ సమృద్ధినీ ॥ తత స్త్రయోదశేవర్షే । రాజామంత్రయత ప్రభుః । అభిషేచయితుం రామం। సమేతో రాజమంత్రిభిః ॥

(2) **2-3-4** చైత్రశ్శ్రీమానయమ్మాసః । పుణ్యః పుష్పితకాననః । యౌవరాజ్యాయ రామస్య। సర్వమేవోపకల్ప్యతామ్ ॥

(3) **2-3-3** సువర్ణాదీని రత్నాని। బలీన్ సర్వౌషధీ రపి । శుక్లమాల్యాని లాజాంశ్చ । పృథక్చ మధుసర్పిషీ । ఇత్యాదినా గ్రాహ్యమ్ ॥

(4) **2-3-16** సూర్యేఽభ్యుదితమాత్రే శ్వో । భవితా స్వస్తివాచనమ్ ॥

**2-4-2** శ్వఏవ పుష్యోభవితా। శ్వోఽభిషేచ్యస్తు మేసుతః॥ రామోరాజీవతామ్రాక్షో । యౌవరాజ్య ఇతిప్రభుః ॥

గలిగియుండుటం జేసి, 'రేపు పట్టాభిషేకంబగును గాన నీదిన ముపవసించు'మని నుడివి యనిచినంతనె నాతం డరిగి కౌసల్యాసుమిత్ర లుండుచోటునకుం జని యుదంతమంతయుం జెప్పి లక్ష్మణునాశ్వసించి నిజగృహంబునకుం జనినంతనె వసిష్ఠుండేతెంచి రామున కుపవాసాదినియమములం జెప్పి చన స్నానాదులొనర్చి [1]దేవాగారమునకు సతీసమేతుండై చని నారాయణునారాధించి యుపవసించె. అంతఁ గైకేయిదాసియగు మంథర నగరమంత యలంకరించియుండుటం గాంచి యేలయని దాసి నడుగ నయ్యది యీ యుదంతంబుఁ జెప్పినంతనె కైకేయికడకుం జని దురాలోచనఁ జేసి '[2]చతుర్దశవర్షములు శ్రీరామునకు వనవాసమును భరతునకు రాజ్యభారమును నేర్పఱచి మును నీకిచ్చినవరములఁ గొనుట కియ్యది సమయ'మని నుడువ నాప్రమదారత్నము ధవునిం గాంచి యనేకదురుక్తుల నుడివియు నెట్టకేలకు రాముని వనవాసమున కంపుటయె నియమింప నయోధ్యయం దెటఁ గాంచిన మంథరాకైకేయులను దూఱనివారుం డొక్కండు లేకుండె. మఱుదినమున (**దుందుభి** సం॥ చైత్ర శుద్ధ ౬) సీతారామలక్ష్మణులు ముప్పు రందఱియనుజ్ఞ వడసి మధ్యాహ్నమున (విజయముహూర్తమున) సుమంత్రుఁడు రథమునుగొనిరా నధిరోహణంబొనర్చి యాదినము రేయుంబవలు సరయూతీరవాసమొనర్చి '[3]యియ్యది వనవాసకార్యమునకుం బ్రథమరాత్రి'యని లక్ష్మణునికి నుడివెను. అయ్యో! ఏమియీ దుర్గతి! లోకమున జనులు దాము సుఖమనుభవించుకాలమును గణుతించెదరుగాని కష్టకాలగణన యనినఁ గడువిషాదమొదవును గద! [4]అంతఁ బురజనులం గలసి యారేయి తమసానదీతీరమున వసించి [5]బ్రాహ్మీముహూర్తమున మేలాంచి సౌమిత్రిం జూచి మనయందపేక్షచేఁ గృహంబులఁ ద్యజించి తరుమూలముల సుప్తిం జెందుజనులం జూచితె! [6]వీరలు లేచుటకుఁ బూర్వము లఘుగమనమున భయరహితమార్గమునం బోవుదమని నుడివి బయలువెడలి పోవుటయు, నుదయంబగుడుఁ

(1) 2-6-1 గతే పురోహితే రామ స్స్నాతో నియతమానసః। సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్ ॥

(2) 2-13-35 త్వయారణ్యం ప్రవేష్టవ్యం। నవవర్షాణి పంచచ॥ భరతశ్చాభిషిచ్యేత యదేత దభిషేచనమ్ ॥

(3) 2-46-2 ఇయమద్య నిశాపూర్వా । సౌమిత్రే ప్రహితా వనమ్ ॥ వనవాసస్య భద్రంతే । స నోత్కంఠితు మర్హతి ॥

(4) 2-46-17 గోకులాకుల తీరాయా । స్తమసాయా విదూరతః ॥ అవస త్తత్ర తాం రాత్రిం । రామః ప్రకృతిభిస్సహ ॥

(5) 2-56-1[illegible] అస్మద్వ్యపేక్షా న్సౌమిత్రే । నిరపేక్షాన్ గృహేష్వపి । వృక్షమూలేషు సంసుప్తాన్ । పశ్యలక్ష్మణ సాంప్రతమ్ ॥

(6) 2-46-21 యావదేవతు సంసుప్తా । స్తావదేవ వయంలఘు । రథమారుహ్య గచ్ఛామః । పంథానమకుతోభయమ్ ॥

బురజనులు నిదుర లేచి రాఘవులంగానక శోకసంతప్తచిత్తులై మఱలి యయోధ్యకుం జనిరి. అట వారలు రాత్రిశేషమున ననతిదూరము చని [1]యుదయమయినతఱి నొక్కయెడ [2] సంధ్యాధికృత్యములందీర్చి గోమతీనదీతరణము గావించి షష్ఠిదినమున [3]సాయంతనమున గంగాతీరమునకుం జని [4]యారేయి గడపి మఱుదిన (శుద్ధసప్తమి) ముదయమున [5]జడలధరించుటకు వటక్షీరములఁ దే గుహునినంప నాతండు తెచ్చిన పిదప రామలక్ష్మణులు జడలధరించి [6]గుహసుమంత్రుల నిద్దఱ నటనిలిపి గంగాతరణ ముంజేసి పూగుత్తుల నలరి చిగురుటాకుల సొంపెసలారు నింగుదీ (భుజపత్రి) వృక్ష పరిసరముననిలిచి [7]మేధ్యములగు మాంసముల క్షుధానివృత్తి యొనర్చి [8]సాయంతన సంధ్యాకార్యములం జేసి 'యిది జనపదమునకు వెలుపల మొదటిరాత్రి'యని లక్ష్మణునకుఁ జెప్పి [9]యారేయి నచ్చటఁ గడపియుదయానంతర మష్టమి నచ్చోటువదలి యదృష్టపూర్వములగు తరుగుల్మలతావనములం గడచి ప్రయాగను గాంచి సన్నిహితమున [10]గంగాయమునామధ్యప్రదేశమున భరద్వాజాశ్రమమునకుం బ్రొద్దు గ్రుంకకుండనె చని మునింగాంచి నమస్కరించి యాతిథ్యాదులంగొని [11]యారేయినచటఁ

---

(1) 2-40-2 తథైవగచ్ఛత స్తస్య । వ్యపాయాద్రజనీ శివా । ఉపాస్యసశివాం సంధ్యాం । విషయాన్తం వ్యగాహత ॥

(2) 2-49-12 గోమతీం గోయుతానూపా । మతరత్సాగరంగమామ్ ॥

(3) 2-50-12 తత స్త్రిపథగాం దివ్యాం । శివతోయా మశైవలామ్। దదర్శ రాఘవో గంగాం। పుణ్యామృషి నిషేవితామ్ ॥

(4) 2-50-59 తథాశయానస్య తతోస్యధీమతో । యశస్వినో దాశరథేర్మహాత్మనః । అదృష్ట దుఃఖస్య సుఖోచితస్యసా। తదా వ్యతీయాయ చిరేణ శర్వరీ ॥

(5) 2-52-88 జటాః కృత్వాగమిష్యామి । న్యగ్రోధక్షీరమానయ । తత్ క్షీరం రాజపుత్రాయ గుహః క్షిప్ర ముపాహరత్ ॥

(6) 2-52-80 అనుజ్ఞాయ సుమంత్రంచ । సబలంచైవ తం గుహం । ఆస్థాయనావం రామస్తు చోదయామాస నావికాన్ ॥

(7) 2-52-102 ఆదాయ మేధ్యాన్ త్వరితం బుభుక్షితౌ। వాసాయ కాలే యయతుర్వనస్పతిమ్॥

(8) 2-53-1 సతంవృక్షం సమాసాద్య । సంధ్యామన్వాస్య పశ్చిమామ్ ॥ రామోరమయతాం శ్రేష్ఠ । ఇతిహోవాచ లక్ష్మణమ్ ॥ అద్యేయం ప్రథమారాత్రి ర్యాతా జనపదాద్బహిః ॥

(9) 2-54-1 తేతుతస్మిన్ మహావృక్షే । ఉషిత్వారజనీం శివామ్ । విమలేభ్యుదితే సూర్యే తస్మాద్దేశాత్ప్రతస్థిరే ॥

(10) 2-54-8 ధన్వినౌతౌ సుఖంగత్వా। లంబమానే దివాకరే ॥ గంగాయమునయోస్సంధౌ । ప్రాపతుర్నిలయం మునేః ॥

(11) 2-55-1 ఉషిత్వారజనీంతత్ర । రాజపుత్రౌ పరందమౌ ॥ మహర్షి మభివాద్యాథ । జగ్మతుస్తంగిరింప్రతి ॥

గడపి నవమియుదయమున నాఋషియనుజ్ఞవడసి చనిచని [1]యొకచోయమునానదీతీరమున విడిసి యా రేయిఁగూడ నాస్థలమున జరుప నుదయంబగుడు లక్ష్మణునిమేల్కొల్పి దశమిదినమునఁ జిత్రకూటగిరికిం జని లక్ష్మణుఁడు పర్ణశాలను నిర్మింప [2]భూతతృప్తిఁ గావించి సీతతో శ్రీరాముండు ప్రవేశమొనర్చె. అనంతర మట విడువంబడిన గుహసుమంత్రులు [3]శ్రీవారు చిత్రకూటముం జేరువఱకచటనె యుండియు, గుహుండు స్వగ్రామమునకుం జన [4]మూఁడవదినము (దశమి) సాయాహ్నమున సారథి యయోధ్యకుం జేరి [5]తానట గుహునితోఁ డంగలసి బహుదినము లుంటిననియు రామశోకాభిభూతములై వృక్షములు వాడినవనియు సరస్సు లుష్ణజలముల నిండియున్నవనియు నుడువ రాజగృహంబున శోక మినుమడింప హాహాకారముల నిండియుండె. [6]అంత నారాత్రి (రాముఁడు వనవాసమునకుం బోయినయాఱవరాత్రి) దుష్కృత మొనర్చితినని తలఁచి [7]యర్ధరాత్రాత్పరమున దశరథుండు ప్రాణముల వదలె. ఆఱవరాత్రి యనఁ జైత్ర శు 5 దినమున వనప్రయాణము గాన యదిమొదలు దశమిరాత్రి యాఱవది యగును. మూఁడవదినమనుటకుం గలిం బేమియని మనచదువరులకు సందియము గలుగకమానదు. సప్తమిపర్యంతము శ్రీవారితోఁ గలసియుండి, దశమిదినమున నయోధ్యకుం బ్రయాణమొనర్చిన సుమంత్రుఁడు స్వామిని విడనాడినమూఁడవదినమని గ్రహింపవలయు. అనఁగ శ్రీరాములు దశమిదినమునఁ జిత్రకూటమునకుం జేర నాదినము సాయంతనసమయమునకు సుమంత్రుఁ డయోధ్యం జేరె. ఇఁక దశరథుని

(1) 2-55-34 విహృత్య తే బర్హిణపూగనాదితే। శుభే వనే వానరవారణాయుతే॥ సమం నదీవప్ర ముపేత్య సమ్మతం। నివాసమాజగ్ము రదీనదర్శనాః॥

(2) 2-56-35 తాం తర్పయిత్వా భూతాని రాఘవః సహసీతయా। తదా వివిశతు శ్శాలాం సుశుభాం శుభలక్షణామ్॥

(3) 2-57-2 భరద్వాజాభిగమనం। ప్రయాగే చ సహాసనం॥ ఆగిరేర్గమనం తేషాం। తత్రస్థైరుపలక్షితమ్॥

(4) 2-57-5 తతస్సాయాహ్నసమయే। తృతీయేఽహని సారథిః॥ అయోధ్యాం సమనుప్రాప్య నిరానందాం దదర్శ హ॥

(5) 2-59-7 గుహేన సార్ధం తత్రైవ స్థితోఽస్మి దివసాన్ బహూన్॥ ఆశయా యది మాం రామః। పునశ్శబ్దాపయేదితి॥ అపి వృక్షాః పరిమ్లానాః। సపుష్పాంకురకోరకాః॥ ఉపతప్తోదకా నద్యః। పల్వలాని సరాంసి చ॥

(6) 2-63-4 స రాజా రజనీం షష్ఠీం। రామే ప్రవ్రాజితే వనమ్॥ అర్ధరాత్రే దశరథః సంస్మరన్ దుష్కృతం కృతమ్॥

(7) 2-64-79 యథా తు దీనం కథయన్నరాధిపః। ప్రియస్య పుత్రస్య వివాసనాతురః॥ గతేఽర్ధరాత్రే భృశదుఃఖపీడిత। స్తదా జహౌ ప్రాణ ముదారదర్శనః॥

మరణానంతరము జరిగినయుదంతంబు వివరించెద. [1] ఉదయాత్పూర్వము వందిమాగధాదులు మేల్కొలుప నిశ్శబ్దముగనుండ దాసీజనంబు లంతఃపురంబునకుంజని విగతాసుండగుదశరథునిఁ గాంచి పత్నులకుం దెలుపఁ బ్రలాపములం గొంతతడవుజరుగ ననంతరము మంత్రులేతెంచి [2] మృతకళేబరముఁ దైలద్రోణియందు నునుచువఱకు నాదినము (ఏకాదశి) సాయంతనసమయ మాయె. [3] ఆరాత్రియుంగూడఁ బ్రలాపంబులంగడపి భరతమాతయగు కైక నందఱు దూఱసాగిరి. [4] మఱునాఁ (ద్వాదశి) డుదయమున మార్కండేయ జాబాలి కాత్యాయన గౌతమప్రభృతులు వసిష్ఠమూలముగ మంత్రిసత్తములకు నరాజకరాష్ట్రముండం జనదని నుడువ నంత దూతలంబిలిచి [5] పథ్యశనాదులనొసఁగి యనిచిన నాదినమచటనె యుండియు [6] మఱుదిన మతత్వరితగమనమున సన్నిహితమార్గమున కేకయరాజధానికిం జని యారేయి భరతునింజూడక మఱుదినము (చతుర్దశి) ఉదయకాలమున దర్శనమొనర్చి యాక్షణమున నతనిం దోడ్కొని యయోధ్యాగమనోన్ముఖులై [7] నాఁటి కేడవదినమున రాత్రివఱకు (చైత్ర బ 5) నయోధ్యకుం జేరినయంతం గౌసల్య మొదలగుపత్నులపరిదేవనమున నాసాయము కాలహరణమై శపథాదులనొనర్చి [8] శోకంబునం జరుప (చైత్ర బ 6 దినమున) ప్రభాకరోదయంబగుడుఁ [9] దానాహితాగ్నియగుటం జేసియుఁ బితృకార్య మైనందున నమావాస్యాంతముఁ బునర్దశాహకృత్యమును

(1) 2-65-1 అథరాత్ర్యాం వ్యతీతాయాం। ప్రాతరేవాపరేఽహని॥ వందినః పర్యుపాతిష్ఠన్। తత్పార్థివనివేశనమ్॥

(2) 2-66-16 తైలద్రోణ్యాంతు సచివైః। శాయితం తం నరాధిపమ్॥ హామృతోయమితిజ్ఞాత్వా। స్త్రియస్తాః పర్యవారయన్॥

(3) 2-66-26 గతేతుశోకాత్త్రిదివం నరాధిపే। మహీతలస్థాసు నృపాఙ్గనాసుచ॥ నివృత్తచారస్సహసాగతోరవిః। ప్రవృత్తచారా రజనీ హ్యుపస్థితా॥

(4) 2-67-2 వ్యతీతాయాన్తు శర్వర్యా। మాదిత్యస్యోదయేతతః॥ సమేత్య రాజకర్తారస్సభామీయుర్ద్విజాతయః॥

(5) 2-68-10 దత్తపథ్యశనాదూతా। జగ్ముస్స్వం స్వం నికేతనమ్॥

(6) 2-68-20 యయుః పథాతిమహతా। శాసనం భర్తురీప్సవః॥ తేశ్రాన్తవాహనాదూతా। వికృష్టేనపథాతతః॥ గిరివ్రజంపురవరం। శీఘ్రమాసేదురంజసా॥ అహేడమానాస్త్వర యాస్మదూతా। రాత్ర్యాంతుతే తత్పురమేవయాతాః॥

(7) 2-72-8 అద్యమే సప్తమీరాత్రి। శ్చ్యుతస్యార్యకవేశ్మనః॥

(8) 2-75-65 లాలప్యమానస్య విచేతనస్య। ప్రణష్టబుద్ధేః పతితస్యభూమౌ॥ముహుర్ముహుర్నిశ్వసతశ్చఘర్మం। సాతస్యశోకేన జగామ రాత్రిః॥

(9) 2-76-23 కృతోదకంతే భరతేనసార్ధం। నృపాఙ్గనామంత్రి పురోహితాశ్చ॥ పురీంప్రవిశ్యాశ్రుపరీతనేత్రా। భూమౌదశాహం వ్యనయన్త దుఃఖమ్॥

క్రమముగ జరపి [1] వైశాఖ శు 1 యాశౌచనివృత్తియు వైశాఖ శు 2 (ద్వాద
శాహమున) సాపిండ్యాది శ్రాద్ధకర్మముల నొనర్చియు [2] వైశాఖశుక్ల తృతీయదినమున
(పదుమూఁడవదినము) శోకమూర్ఛితుఁడై పలువిధముల విలపించె. [3] అనంతరము
వైశాఖశుద్ధ చతుర్థిదినమున (పదునాల్గవదినము) బంధుమిత్రపురోహితామాత్యులం
దఱేకవచస్కులై భరతునిఁ బట్టాభిషిక్తుంజేయఁ బూనుటయు నా మఱుసటి సమ
యమున (వైశాఖ శు 5) [4] వందిమాగధులు మంగళసంహితల స్తుతి యొనర్చుట
యు నెవరెన్నివిధములఁ జెప్పినను దాఁ బట్టాభిషిక్తుఁడగుట కియ్యకొనక శ్రీరాము
లఁ దా మరలింపఁ బోవలయునని మార్గశోధకుల కుత్తరువు నిచ్చి యెల్లులతోఁ
జనుటకు రథముల నాయత్తముంజేయ సుమంత్రునికిం జెప్ప నాతండును సిద్ధమొన
ర్ప [5] మఱుదిన (వైశాఖ శు 6) ముదయమున రామదర్శనలాలసుఁడై భరతుం డతి
త్వర [6] గంగాకూలముం జేరి గుహునిదర్శించి యతండు దెలుప రామశయ్యాదులం
జూచి విలపించియు, సప్తమినాఁ డుదయమునఁ దానును జటాధారణంబొనర్చి గంగ
నుదాఁటి భరద్వాజాశ్రమమునం [7] దారాత్రి యాతిథ్యాదుల గ్రహించి [8] మ
ఱుదిన ముదయమున (అష్టమి) ననుజ్ఞాతుఁడై [9] పర్ణశాలను జటామండలమండితుం
డగు రాముని గనియె. [10] అంత యుగాంతభాస్కరునివలె దుర్నిరీక్ష్యుండును జటా

(1) 2-77-1 తతో దశాహేతిగతే । కృతశౌచో నృపాత్మజః । ద్వాదశే హని సంప్రాప్తే । శ్రాద్ధకర్మాణ్య కారయత్ ॥

(2) 2-77-4 తతః ప్రభాతసమయే । దివసేఽథ త్రయోదశే ॥ విలలాప మహాబాహు ర్భరత శ్శోకమూర్ఛితః॥

(3) 2-79-1 తతః ప్రభాత సమయే।దివసేచ చతుర్దశే॥ సమేత్య రాజకర్తారో।భరతం వాక్య మబ్రువన్.

(4) 2-81-1 తతో నాందీముఖీం రాత్రిం । భరతం సూతమాగధాః । తుష్టువుర్వాగ్విశేషజ్ఞాః। స్తవైర్మంగళసంహితైః॥

(5) 2-83-1 తతస్సముత్థితః కాల్య । మాస్థాయ స్యందనోత్తమమ్ । ప్రయయౌ భరతశ్శీఘ్రం । రామదర్శనకాంక్షయా॥

(6) 2-83-19 తేగత్వాదూరమధ్వానం । రథయానాశ్వకుంజరైః । సమాసేదు స్తతో గంగాం। శృంగిబేరపురం ప్రతి॥

(7) 2-90-24 తత స్తథేత్యేవముదారదర్శనః । ప్రతీతరూపో భరతోఽబ్రవీద్వచః । న కారబుద్ధించ తదాతదాశ్రమే । నిశానివాసాయ నరాధిపాత్మజః॥

(8) 2-92-1 తతస్తాంరజనీముష్య । భరతస్సపరిచ్ఛదః। కృతాతిథ్యోభరద్వాజం । కామా దభిజగామహ॥

(9) 2-99-25 నిరీక్ష్యసముహూర్తంతు । దదర్శభరతోగురుం । ఉటజేరామమాసీనం । జటామండలధారిణమ్॥

(10) 2-100-1 జటిలంచీరవసనం। ప్రాంజలిం పతితంభువి। దదర్శరామోదుర్దర్శం । యుగాంతేభాస్కరంయథా॥

వటలధారియుఁ బ్రాంజలియుఁ బ్రణతుఁడునై భూమిపయిం బడియుండు భరతునిం గాంచి రాముండు లాలనఁ జేసి, ధర్మావసరప్రశ్న మొనర్చి రాజవృత్తాంతశ్రవణజనితశోకోపహతులయి యాదినమంతయు నటులు గడపి మఱుదినమున (నవమి) స్నానపిండోదకదానాదులం జరిపి దశమ్యుదయమున బంగారువికారంబగు పాదుకలఁ దానధిష్ఠించి భరతునకు దయచేయు నాతఁడామె యచటువాసి యతిశీఘ్రమున [2]నయోధ్యకు సాయంతనమునఁ జని తల్లులనటనిలిపి [3]శ్రీరాముండిచట లేనియీ దుఃఖము నంతయు నందిగ్రామమునకుం జని యట సహించెదనని వసిష్ఠాదులకుం జెప్పి మఱునాఁడు (ఏకాదశి) [4]పాదుకల నొకచోఁ బ్రతిష్ఠాపించి రాజ్యభారముఁ దాన నిర్వహించుచుఁ బాదుకలకు నిత్యము రాజ్యాంగకృత్యమును నివేదించుచుండెను.

[5]అట రాముఁడు చిత్రకూటమున మూఁడుదినములం గడపి నిఁక నిట నుండం జనదని యెంచి భరతాగమన మాతృదర్శనస్థలంబులం జనకజకుఁ జూపుతఱి దండకావనమున ఖరదూషణుల దాడికిబెదరి యందందచరించు ఋషులు గొందఱిటకేతెంచి దుఃఖముల నుడువ నాదిన (చతుర్దశి) ముదయమున నచ్చోటును విడిచి [6] యత్ర్యాశ్రమమునకుంజని మ్రొక్కుడునంతని నతం (అత్రిమహాముని) డతిముదమునఁ బుత్త్రినివలె నితనిం జూడ నంతజానకియు ననసూయాదేవికడకుంజని యభివాదనంబొనర్చ నామెయు ననామయంబడిగి సత్కథలఁ బ్రొద్దుపుచ్చుచనుండ నట సీత తనవివాహవృత్తాంతంబంతయు నుడువ [7] వినిసంతసించి నేఁడుమార్తాండుం డపరదిశ నలంకరించె. పగలాహార సంపాదనకుంజని సంధ్యలనిద్రుంగూరు పక్షులకలకలంబు వినంబడు. [8] నక్షత్రముల నలంకరింపఁ బడియుఁ జంద్రికావరణయుతుండగు మృగాంకుఁ డుదయం

---

(1) 2-112-22 సోధిరుహ్యనరవ్యాఘ్రః। పాదుకే హేమభూషితే । ప్రాయచ్ఛత్సుమహాతేజా। భరతాయ మహాత్మనే॥

(2) 2-114-1 స్నిగ్ధగంభీర ఘోషేణ । స్యందనేనోపయాత్ప్రభుః । అయోధ్యాంభరతఃక్షిప్రం। ప్రవివేశమహాయశాః॥

(3) 2-115-2 నన్దిగ్రామం గమిష్యామి। సర్వానామంత్రయేఽద్య వః। తత్ర దుఃఖమిదంసర్వం। సహిష్యేరాఘవంవినా॥

(4) 2-115-25 పాదుకేత్వభిషిచ్యాథ। నన్దిగ్రామేఽవసత్తథా । భరతశ్శాసనంసర్వం । పాదుకాభ్యాం న్యవేదయత్॥

(5) 2-116-1 ప్రతిప్రయాతేభరతే । వసన్ రామస్తపోవనే । లక్షయామాససోద్వేగ । మథౌత్సుక్యంతపస్వినామ్॥

(6) 2-117-5 సోఽత్రేరాశ్రమమాగమ్య । తం వవందే మహాయశాః । తంచాపిభగవానత్రిః । పుత్రవత్ప్రత్యపద్యత॥

(7) 2-119-3 రమేహంకథయాతేతు । దృఢంమధురభాషిణీ । రవిరస్తంగతశ్శ్రీమా । నుపోహ్యరజనీంశివామ్॥

(8) సంప్రవృత్తా నిశాసీతే । నక్షత్రసమలంకృతా । జ్యోత్స్నాప్రావరణశ్చంద్రో । దృశ్యతేభ్యుదితోంబరే॥

బరముననుదయమయ్యె. నీవునుదివ్యాలంకారశోభితవై నామనమునకింపు గలిగింపుమనియు, శ్రీరామున కనుచరురాలవై సుఖంబుండుమనియు, నుడివి యానతిచ్చెదం బోదువుగాకయనె. ఈరీతివర్ణనలచే నీదినము శుక్లపక్షచతుర్దశియని నిర్ణయపఱచి (1)యారాత్రియుంగూడ రాముండచటనెయుండి యుదయమైనతఱిం దాపసుల యనుజ్ఞవడసి (3) స్వస్త్యయనపూర్వకముగవైశాఖశుద్ధ పౌర్ణమిరోజున దండకారణ్యముం బ్రవేశించెను.

(1) 2-119-16 తతస్తాంశర్వరీం ప్రీతః । పుణ్యాం శశినిభాననః । అర్చితస్తాపసైస్సిద్ధై । రువాస రఘునందనః॥

(2) 17 తస్యాంరాత్ర్యాంవ్యతీతాయా।మభిషిచ్య హుతాగ్నికాన్ ।అపృచ్ఛేతాంనరవ్యాఘ్రౌ। తాపసాన్వనగోచరాన్ ॥

(3) 2-119-22 ఇతీవతైఃప్రాంజలిభిస్తపస్విభి ।ర్ద్విజైఃకృతస్వస్త్యయనః పరంతపః । వనం స భార్యః ప్రవివేశ రాఘవ। స్సలక్ష్మణస్సూర్య ఇవాభ్రమండలమ్॥

అయోధ్యాకాండము సమాప్తము.



# అరణ్యకాండము.

అనంతరము సతీసమేతుఁడగు శ్రీరాముఁడు లక్ష్మణయుతుఁడై తపోబలము గల ద్విజులచే ననుజ్ఞాతుఁడై స్వస్త్యయన పూర్వకముగ ఘోరదనుజహరణము గావింపఁ [1] దండకావనమును దుందుభి సం॥ వైశాఖ శుక్ల పూర్ణిమ దినమునం బ్రవేశించి యచ్చటచ్చటఁ దాపసాశ్రమముల ననేకములఁ సందర్శించెను. అందుఁ బ్రథమదినమున (వైశాఖ శు 15) నొకతాపసకూటమునం గని వారలచట నాతిథ్యాదులొసఁగ [2] నహోరాత్రములఁ గడపి యుదయానంతరము (వైశాఖ బ 1) సింహవ్యాళమృగాకీర్ణమగు వనమునం జను నెడ విరాధుండను రక్కసుఁడేతెంచి సీతను హరించి పరుగిడ నాతని యుభయబాహుల నుభయులు (రామలక్ష్మణులు) ఖండింప నతఁడు దనశాపవృత్తంబును నుడివి స్వమరణోపాయంబు దెలుప నటు చేసి యాతనిని శమనాలయమునకుఁ బంపి, యాదినము సాయాహ్నమున శరభంగాశ్రమమునకుం జేరుసమయమున నాయనకు బ్రహ్మలోక గమనార్థము విమానమును దేవతలు నేతెంచి భూస్పర్శము లేక యుండం గాంచి యిదియేమి చిత్రమని యడుగ నుదంతంబంతయుఁ దెలిపి హుతాశనప్రవిష్టుఁడై దహింపఁబడి యందుఁ బంచవింశవర్ష (25) వయస్కపురుషుం డొకఁడుగన్పడ వీరలు నాశ్చర్యమగ్నులరై కాంచు నెడ, నతండు విమానారూఢుఁడై చనియె. అనంతరము వైఖానసవాలఖిల్యాది ఋషినికరము వెనువెంట నడచుచుఁ దమతమ దుఃఖకారణముం దెలుప విని వారితోడన సుతీక్ష్ణాశ్రమమునకుం జని యాయనతోఁ గుశలప్రశ్నముఁ జేయుతఱి [3] సాయంతనముగుట సంధ్యాదికృత్యముల నొనర్చి యట సత్కరింపఁబడి [4] మఱునాఁడు (విదియ) దయమైనపిదప నాయన యానతింగొని బహుదూరము జని [5] మార్తాండుండస్తగిరి నొం

(1) **3-1-1** ప్రవిశ్యతు మహారణ్యం । దండకారణ్య మాత్మవాన్ । దదర్శరామోదుర్ధర్ష । స్తాపసాశ్రమ మండలమ్॥

(2) **3-2-1** కృతాతిథ్యోథరామస్తు । సూర్యస్యోదయనం ప్రతి। ఆమన్త్ర్య సమునీంత్సర్వా న్వనమే వాన్వగాహత॥

(3) **3-7-23** అన్వాస్య పశ్చిమాంసన్ధ్యాం। తత్రవాస మకల్పయత్ । సుతీక్ష్ణస్యాశ్రమేరమ్యే। సీతయాలక్ష్మణేనచ॥

(4) **3-8-4** ఉదయంతందినకరం । దృష్ట్వావిగతకల్మషాః । సుతీక్ష్ణమభిగమ్యేదం । శ్లక్ష్ణం వచనమబ్రువన్॥

(5) **3-11-5** తేగత్వాదూరమధ్వానం । లంబమానేదివాకరే। దదృశుస్సహితారమ్యం।తటాకమ్ యోజనాయతమ్॥

డుటకుఁ గొంచెముముందు గజయూథాలంకృతమును సారసహంసకాదంబసంకులము నగునొక సరస్సును గని యద్దాని యంతరమున నేరినింగానక వినంబడు మృదుమధురవీణాగానము నాలించి ధర్మభృతుండను ఋషిం గాంచి యిదియేటివింతయని యడుగ నతండిది [1] పంచాప్సరతటాకమనియు మాండకర్ణి నిర్మితంబనియుం దెలుప విని ముదంబొంది యనంతర మొక తాపసాశ్రమముంగని యటఁ గొండొకకాలంబు గడపి యాదంద ఋషియాశ్రమములం గనుచు [2] నొకచోఁ జిత్రకూటవాసము మొదలిరునదిమాసములును మఱియొకచోఁ బండ్రెండుమాసములును, వేఱొకచోఁ బదునాఱు మాసములును, మఱియు నింకొకచో ముప్పది మాసములు ననంతర మొకస్థలమునఁ బదుమూఁడు మాసములును, వేఱొకయెడఁ బదునెనిమిది మాసములును బిదపనొకయెడ మూఁడుమాసములును, మఱియు నెనిమిదిమాసములును నిలుచుచుం జనఁ బదిసంవత్సరములు గడచె. [3] వెండియు సుతీక్ష్ణాశ్రమమున కేతెంచి యటఁ గొంతకాలము (రెండుసంవత్సరములు) గడపిరి. అనంతర మగస్త్యాశ్రమమునకుం జన నుద్యుక్తులై యుండునెడ సుతీక్ష్ణుం డగస్త్యభ్రాతయాశ్రమమిట సన్నిహితమని నుడువ నంతంజని తాపసిం గాంచి నమస్కరించి [4] యినుండస్తమింప సాయంసంధ్యాకృత్యముల నొనర్చి యారేయి నచట నాతిథ్యాదులం గొని, సుఖసుప్తులై మఱుదిన ముదయమున నాజ్ఞంగొని యగస్త్యాశ్రమమునకుం జని ఋషిం గాంచి వందనాదుల నొనర్చి యర్ఘ్యాదులంగొని యుపవిష్టులై యుండునెడ నగస్త్యుఁడు విశ్వకర్మనిర్మితమగు వైష్ణవచాపమును బ్రహ్మదత్తశరములను ఖడ్గమును దయచేయ నయ్యవి గ్రహింపఁబడిన పిదప [5] రవ్యస్తమయ సమయమగుడు సంధ్యాదులం జరపి నిద్రంగూరి యుదయమున మేల్కాంచి పూర్వాహ్ణకృత్యములం జేసి వందనాదుల

(1) 3-11-11 ఇదంపంచాప్సరో నామ । తటాకం సార్వకాలికమ్। నిర్మితం తపసా రామ మునినా మాండకర్ణినా॥

(2) 3-11-25 క్వచిత్పరిదశాన్మాసా । నేకం సంవత్సరం క్వచిత్ । క్వచిచ్చ చతురో మాసాన్ । పంచషట్చ పరాన్ క్వచిత్॥ అపరత్రాధికం మాసా। దప్యర్థమధికం క్వచిత్ త్రీన్ మాసానష్టమాసాంశ్చ। రాఘవోన్యవసత్సుఖమ్ । రమతశ్చానుకూల్యేన యయుస్సంవత్సరాదశ॥

(3) 3-11-29 సుతీక్ష్ణస్యాశ్రమం శ్రీమా । న్పునరేవాజగామహ।। తత్రాపిన్యవసద్రామః కంచిత్కాల మరిందమః॥

(4) 3-11-71 రామస్యాస్తంగతస్సూర్య । స్సంధ్యాకాలో భ్యవర్తత। ఉపాస్యపశ్చిమాం సంధ్యాం సహ భ్రాత్రా యథావిధి॥ న్యవసత్తాం నిశా మేకాం । ప్రాశ్య మూలఫలాని చ। తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం । విమలే సూర్యమండలే । భ్రాతరం తమగస్త్యస్య । హ్యామంత్రయత రాఘవః॥

(5) 3-13-10 రవిరస్తంగతస్సౌమ్య సంధ్యాకాలో భ్యుపాగతః। ఉపాస్యపశ్చిమాం సన్ధ్యాం । రామస్సౌమిత్రిణా సహ । సుష్వాప రజనీం తాంతు। పూజితః పరమర్షిణా । సుఖోషిత స్తదా రామ స్సంధ్యామన్వాస్య సానుజః । కృత్వా పౌర్వాహ్ణికం తస్థౌ । స్నాతో హుతహుతాశనః॥

నగస్త్యునిం బరితుష్టినొనర్చి సుఖాసీనులై నతఁడు [1] దశరథునిచే నియమింపఁబడిన కాలము గడచిపోవు చున్నయది. ప్రతిజ్ఞనంతయు జరపి సుఖముగ నీరాజ్యమున నివసింపుమని యాతం డాశీర్వదింపం జిత్తమని నుడివిన యనంతరమున దండకారణ్య విషయముం దెల్పవిని మేమువసించుటకుం దగిన స్థలమును దెలుపవలయునని యడుగ విచారించి గోదావరీతీరమున నిచటికి [2] ద్వియోజనాధ్వగమనమునఁ బంచవటీతీరమునకుంజని వసింపుఁడని నుడువ వారలు బయలువెడలి పోవునెడ జటాయువుంగని యనంతరము పంచవటీతీరమునకుంజని రమణీయంబగు స్థలమునఁ బర్ణశాలనొకటి నిర్మించికొని విడిసిరి. వనవాసము మొదలచ్చటచ్చటఁ గొన్నిమాసములు నిలుచుచుజనిన నునుగణన ప్రకారము పదిసంవత్సరములును సుతీక్ష్ణాశ్రమమున రెండుసంవత్సరములు గడువ మొత్తమునకుఁ బండ్రెండువత్సరంబు లయినపిదప నగస్త్యాశ్రమమున నొకదినముండి మఱుదినమునఁ బంచవటిని జేరి రనుటవలనను, అగస్త్యుఁడు "కాలోయంగత భూయిష్ఠః" అనుటవలనఁ జాలకాలము జరిగినదని గన్పట్టును. కాన పదుమూడవ సంవత్సరారంభమునఁ బంచవటిని జేరిరనుట యుచితము. పంచవటీతీరముననుండు సమయమున [3] శరద్ధేమంతకాలములను మొందుగవర్ణించి యనంతర [4] మభిషేకార్థము గోదావరికిఁజనుచుండెడు సమయము చైత్రమాసాంతమని యెంచ నగును. ఎటులనిన, రావణవధానంతరమున నతిశీఘ్రముగ [5] భరద్వాజాశ్రమమునకు వచ్చుసమయము పదునాల్గుసంవత్సరముల పూర్తిని తెలియఁజేయుచున్నందున, దుందుభిసంవత్సర చైత్ర శు 5 దినమున వనవాసప్రయాణ మొనర్చిన శ్రీరామునికి ధాతృ సంవత్సర చైత్ర శు 5 వఱకు నియతకాలము పూర్తియగును గాన తత్పూర్వ మమావాస్య (రావణవధ యొనర్చినదినము) ఫాల్గునమాసమునఁ జేరుట చేతను, నద్దానికిఁ బదునెనిమిదవ రోజు వెనుక [6] (ఫాల్గున శు 13) వాయుసూనుఁడు లంక కేఁగినపుడు పదియవమాసము జరుగుచున్నదియని సీతావాక్యము గ్రహించిన యెడ జ్యేష్ఠమున సీతాహరణమని ధ్రువమగును. ఇంతియ కాక హరణాత్పూర్వ

(1) 3-13-22 కాలోయంగతభూయిష్ఠో । యఃకాల స్తవరాఘవ । సమయోయోనరేందేశ్రేణ కృతోదశరథేనతే । తీర్ణప్రతిజ్ఞఃకాకుత్స్థ । సుఖంరాజ్యే నివత్స్యతి॥

(2) 3-13-53 ఇతో ద్వియోజనే తాత । బహుమూలఫలోదకః । దేశోబహుమృగశ్రీమాన్ । పంచవట్యభివిశ్రుతః॥

(3) 3-16-1 వసత స్తస్యతుసుఖం । రాఘవస్య మహాత్మనః। శరద్వ్యపాయే హేమన్త। ఋతురిష్టః ప్రవర్తతే॥

(4) 3-16-2 సకదాచిత్ప్రభాతాయాం । శర్వర్యాంరఘునందనః । ప్రయయా వభిషేకార్థం । రమ్యాం గోదావరీంనదీమ్॥

(5) 6-127-1 పూర్ణేచతుర్దశేవర్షే । పంచమ్యాం రఘునందనః । భరద్వాజముపాగమ్య । వవందే నియతోమునిమ్॥

(6) ఏతద్విషయం సుందరకాండే స్పష్టీకృతం॥

ము రావణుఁడు మారీచాశ్రమమునకు రెండవసారి వచ్చినపుడు [1] శంఖములు ముత్యపుచిప్పలు మొదలగునవి సముద్రతీరమున నిండిపడియున్న వను గ్రీష్మధర్మ సూచకవాక్యములను గమనించియు నది వైశాఖమనియెంచి తత్పూర్వ మవిలంబముగ శూర్పణఖ కర్ణనాసికాచ్ఛేదనము, పదునలుగురు రాకాసిబంట్లవధయు ఖరదూషణాది వధయు నకంపనుని లంకాగమనము రావణుఁడు మారీచుకడకుఁ బోయి మరలింపఁబడుటయు శూర్పణఖ లంకాగమనము తదనంతరము మారీచాశ్రమమునకు రావణుఁడు రెండవసారి చనుటయు నను కార్యము లొకటి తరువాత నొకటి వ్యవధిహీనముగ జరిగినవిగాన సీతారామలక్ష్మణు లభిషేకార్థము గోదావరికిఁ జనుసమయము గూడ వైశాఖ మాసారంభమనియు నెంచఁదగును గనుక వనవాసమునం బదుమూడవయేటఁ బంచవటీతీర ప్రవేశమునుఁ బదుమూడుమాసముల యిరువదియైదు దినము లచటనుండుటయుఁ బదుమూడు మాసములు గడచినవెనుకఁ బదునాల్గవమాసా (వైశాఖము) రంభమున శూర్పణఖ రాకయు జరిగెనని దృఢపఱుప వచ్చును. ఇంకొకవిషయమును యోజించినను మాసారంభమున శూర్పణఖరాకయని యనఁగలము. సీతారామలక్ష్మణు లభిషేకమునకు గోదావరికింజని యచట పితరులకును దేవతలకును జలతర్పణముసేసి సమాహితులై భాస్కరస్తుతి యొనర్చిరనియుం గలదు. కాన నొకవేళ నాదిన మమావాస్యయని తర్పణాదులవలనఁ దలంచినను మఱునాఁడు మాసారంభము. [2] అంతశూర్పణఖ రాముని మోహించి వేడఁ దాఁ [3]గృతదారుఁడననియు, నకృత దారుండగు తన యనుజునికడకుఁ జనుమన [4]నదియటులుసేయ నాతండు ముక్కుసెవులఁగోయుటయు నంత నదిచని యావార్త ఖరునకుంజెప్ప నాతఁడు [5]పదునల్వురరక్కసుల నంపవారలను శ్రీరాముండు గూల్చుటయు ననంతరము ఖర దూషణ త్రిశిరులు కదన

(1) 3-35-24 సశంఖమౌక్తికాజాలమ్। ప్రవాళనిచయంతథా। ముక్తానాంచసమూహాని। శుష్యమాణానితీరతః॥

(2) 3-17-6 సాతుశూర్పణఖానామ । దశగ్రీవస్యరక్షసః । భగినీరామమాసాద్య। దదర్శత్రిదివోపమ్। బభూవేంద్రోపమందృష్ట్వా । రాక్షసీకామమోహితా॥

(3) 3-18-2 కృతదారోస్మిభవతి। భార్యేయందయితామమ।అనుజస్త్వేషమేభ్రాతా।శీలవాన్ ప్రియదర్శనః। శ్రీమానకృతదారశ్చ। లక్ష్మణోనామవీర్యవాన్ ॥

(4) 3-18-21 ఇత్యుక్తోలక్ష్మణస్తస్యాః । క్రుద్ధోరామస్యపార్శ్వతః । ఉద్ధృత్యఖడ్గంచిచ్ఛేద। కర్ణనాసమ్మహాబలః॥

(5) 3-19-25 ఇతిప్రతిసమాదిష్టా । రాక్షసాస్తేచతుర్దశ । తత్రజగ్ముస్తయాసార్ధం। ఘనావాతేరితాయథా॥

మునకుం జనుదేర మూడుగడియలలోనం బరిమార్చుటయు [1]నకంపనుఁడు ప్రకంపన (వాయు) వేగమున లంకకుంజని దశవదనున కీయుదంతంబు నివేదించిన విని మేకొనిసి [2]మారీచుకడకుంజని మరలింపఁ బడి సుఖంబున గృహంబుఁ జేరుటయు నంత శూర్పణఖ రావణసదనమునకుం జని తన తెలంగెత్తిఁగింపఁ గనలి మరలి మారీచుని కడకుం జని యాతనిని వెంట నిడుకొని పంచవటీతీరముఁ జేరుటయు. మాయామృగరూపమును మారీచు డవలంబింప నద్దానిదెమ్మని సీతభర్తకుం దెలుప నతండు దాని విను వెంటనెచని లభ్యంబుగామి వధించె. అనంతరము సీత లక్ష్మణుని దూఱుటయు నతండగ్రజునిఁ జూడఁబోవుటయు రావణుఁడే తెంచి సీతను గొని లంకకరుగుటయను కార్యము యువ సం॥ జ్యేష్ఠ శు ! యని చదువరులు గ్రహింపనగు. కనుక వనవాసారంభ దినము మొదలు సీతాహరణ దినము (పంచవటీవాసము) వఱకు గణించిన పదుమూడుసంవత్సరములు నొకమాస మిరువదియైదు దినములుగ నుండు. సుతీక్ష్ణాశ్రమమున రెండుసంవత్సరములును దక్షిణచోట్లఁ బదిసంవత్సరములు మొత్తము పండ్రెండుసంవత్సరములు ద్రోపుడుసేయఁ బంచవటీతీర వాసము సంవత్సరమునొకమాస మిరువదియైదు దినములుగ నుండు. [3] అంత రామలక్ష్మణులు పర్ణశాలకుంజని జనకజం గానక పిలపిచుచుఁ బోవుతఱి [4]జటాయుదర్శన తదౌర్ధ్వదైహిక సంస్కారములును [5]కబంధవధయు [6]పంపాతీరగమనము శబరీదర్శనమనునవి జ్యేష్ఠ శు 15 లోఁగా నని యెంచవలయు. అటఁ బంపాతీరమున నుండుతఱి [7]"సౌమిత్రీ! పలుగతుల ననువదించు

(1) 3-31-1 త్వరమాణ స్తతో గత్వా । జనస్థానా దకంపనః। ప్రవిశ్య లంకాం వేగేన । రావణం వాక్యమబ్రవీత్ ॥

(2) 3-31-50 ఏవ ముక్తో దశగ్రీవో । మారీచేన స రావణః । న్యవర్తత పురీం లంకాం । వివేశ చ గృహోత్తమమ్॥

(3) 3-61-1 దృష్ట్వాశ్రమపదం శూన్యం । రామో దశరథాత్మజః । రహితాం పర్ణశాలాం చ । విధ్వస్తాన్యాసనాని చ॥

(4) 3-68-1 రామస్సంప్రేక్ష్య తం గృధ్రం । భువి రౌద్రేణ పాతితమ్ । సౌమిత్రిం మిత్రసంపన్న। మిదం వచన మబ్రవీత్ ॥

3-68-39 శాస్త్రదృష్టేన విధినా। జలే గృధ్రాయ రాఘవౌ। స్నాత్వా తౌ గృధ్రరాజాయ। ఉదకం చక్రతు స్తదా॥

(5) 3-70-8 తతస్తౌ దేశకాలజ్ఞౌ । ఖడ్గాభ్యామేవ రాఘవౌ । అచ్ఛిన్దతాం సుసంహృష్టౌ । బాహూ తస్యాంసదేశతః॥

(6) 3-74-4 తౌ పుష్కరిణ్యాః పంపాయా । స్తీరమాసాద్య పశ్చిమమ్ । అపశ్యతాం తత స్తత్ర । శబర్యా రమ్యమాశ్రమమ్॥

(7) 4-1-22 అయం వసన్త స్సౌమిత్రే । నానావిహగనాదితః । సీతయా విప్రహీణస్య । శోకసందీపనో మమ॥

పక్షుల కలకలమున రమణీయమగు నీవసంతము సీతావిహీనుఁడ నగు నాకుశోక మినుమడింపఁ జేయుచున్నయది' యని శ్రీరాముఁడు నుడువుటంజూడ నాసమయము చైత్ర వైశాఖములలో నొకటిగ శంకింపవచ్చును గాని తత్పూర్వము సీతాహరణ సమయముగ నుండినయెడ నంజనీసుతుఁడు లంకం జనకజను గాంచినపుడు [1]పదియవమాసము జరుగుచున్నది యను వాక్యమునకును, వనవాసనిర్ణయమున పదునాల్గు సంవత్సరములకు దుందుభి సం॥ చైత్ర శుద్ధ పంచమిమొదలు ధాతృ సం॥ చైత్ర శుద్ధ పంచమిపఱకు ముగియుచుండుటంజేసియును చైత్రముగాని వైశాఖముగాని మొదలిడి లెక్కించినఁ బుష్యముగాని, మాఘముగాని పదియవమాసమగుట వలనను, వానరుల సీతాన్వేషణ సమయము మార్గశీర్షాంత మారంభమై, పుష్యము వింధ్యగిరియందును మాఘము బిలమునందును గొన్నిదినములు తత్ప్రాంతమునను గడచి ఫాల్గున శుద్ధ త్రయోదశి యాంజనేయుని లంకా గమనమును చతుర్దశి సాయాహ్నము వానరుల కిష్కింధాగమనమును పూర్ణిమ యుద్ధయాత్రయు ఫాల్గునబహుళ మమావాస్య రావణవధయు నను ప్రమాణములకు విరోధముగ నుండుటయేకాక నచ్చటచ్చటఁగనఁబడు నాధారముల కన్నిటికి ననన్వయము సంభవించును గాన జ్యేష్ఠ శు 1 దినమున నె సీతాహరణమనుట యుక్తముగాని వసంతకాలమనుట మాత్రము మనచదువరులు సంశయమని యెంచుటం గూడ [2]మాఘాదిపంచకములు వసంతసంజ్ఞలం లవి యను ప్రమాణమును గ్రహించినఁ బరస్పరవిరోధరహితముగ నుండును. అనంతర మిటునటు సీతజాడఁ దిరుగుటయు, నాబహుళపాడ్యమి హనుమద్దర్శన సుగ్రీవసఖ్యాదులు జరిగినవని ధైర్యముగ నుడువవచ్చును.

---

(1) 5-37-8 వర్తతే దశమో మాసో । ద్వౌతు శేషౌ ప్లవంగమ॥

(2) మాఘాద్యాః పంచవాసంతాః॥

ఆరణ్యకాండము సమాప్తము.



# కిష్కింధాకాండము.

[1]అంతఁ రాముఁడు కుసుమితకుముదవన శోభితంబును, చలదళికుల మంజులా రావంబునగు పద్మాకరంబు బొడఁగాంచి సీతా వియోగజనిత శోకసంతప్తుఁడై ప్రలాపంబులొనర్చి యటనటందిరుగుచు బంపాసరోవర దక్షిణతటమును జేరి [2]'లక్ష్మణా! పలుతెఱంగులగు పక్షులకలకలమున నతిమనోహరమగు నీవసంతసమయము దుఃఖమునినుమడింపఁ జేయుచున్న యది' యని నుడివె. ఈసమయము జ్యేష్ఠబహుళము గాన [3]మాఘము మొదలైదునెలలు వసంతకాల మనెడు నాధారమును గమనించిన యెడ సమన్వయముగనుండును. అనఁగ జ్యేష్ఠశుద్ధపాడ్యమి సీతాహరణ దినముగాన నదిమొదలచ్చటచ్చటఁ దిరుగుచు సీతనుం గానక యిచటికేతెంచిన నాక్షత్రవీరులఁ గీశశూరులు గాంచి సందియమంకురింప నటుడాఁగి యథార్థమును బవనసూనుఁడెఱిఁగి రాఁగలఁడని నతనింబంప వారలు తమయుదంతంబుఁ జెప్పనంత నరవానరరాజులకు సఖ్యంబుఁ జేసి ఋశ్యమూకమున వసించుటయు, సుగ్రీవ మనోనిశ్చయముకొఱకు సాలఖండన దుందుభికాయోత్క్షేపణాది ప్రత్యయములఁ గావించి వాలిసుగ్రీవులనిరువురఁ బోరునకుం డీకొలిపి (4) వాలి నొకకోల నేలంగూల్చిన దిన మాషాడశుద్ధ పూర్ణిమయని యెంచనగు. అనంతరము సుగ్రీవపట్టాభిషేకంబు నంగదుని యౌవరాజ్య పట్టాభిషిక్తునిం జేయుటయు నా మాసాంతములోపలనై యుండవలసివచ్చును. ఏలనన శ్రావణమాసము మొదలు నర్ష రాత్రముల శ్రీరాముని గుహావాసమును తదనంతరము వానరసమ్మేళన సీతాన్వేషణాదుల కాలనిర్ణయమునకు విరోధము లేకుండ యోజనసేయవలయు గాన నీసమయమున నిక్కార్యములు జరిగిన వనుటయే యుక్తము. అనంతరము [5]వార్షికమాసములలోన మొదటిదగు శ్రావ

(1) 4-1-1 సతాంపుష్కరిణీంగత్వా । పద్మోత్పలఝషాకులామ్. రామస్సౌమిత్రిసహితో విలలాప కులేంద్రియః॥

(2) 4-1-22 అయంవసన్త స్సౌమిత్రే । నానావిహగనాదితః । సీతయా విప్రహీణస్య । శోకసందీపనోమమ॥

(3) మాఘాద్యాఃపంచవాసంతాః॥

(4) 4-17-37 ఇంద్రధ్వజఇవోద్ధూతః । పౌర్ణమాస్యాంమహీతలే । ఆశ్వయుక్సమయేమాసి । గతశ్రీకో విచేతనః॥

(5) 4-26-13 పూర్వోయంవార్షికోమాస । శ్రావణస్సలిలాగమః । ప్రవృత్తాస్సౌమ్యచత్వారో । మాసావార్షికసంజ్ఞకాః॥

ణము ప్రవేశించుచున్నయది. [1] ఈవర్షసమయమంతయు రమ్యమై విశాలమై సుఖము నకుఁదగిన వాయుచలనముగల యీగిరిగుహనువసింత'మని రాముడనుజునకుఁ జెప్పెను. కనుకఁ దత్పూర్వ మాషాఢమని ధ్రువపడును. [2]ఎటుఁజూచిన నుఱుముల మెఱపులం గానకఁ వెన్నెల లాకసముననిండి పర్వియుండుటంగని వాయుసూనుఁడు సుగ్రీవునికడ కరుదెంచి '[3] ముందొక ఘనకార్యమాయనవలన నీకుం జేకూఱె. ఇపు డాయన కార్యమును నీవుచేయు సమయ మియ్యది యైనకతన వానరబలంబుల రావించి సీతాన్వేషణంబు జేయింపు'మని హితబోధఁజేయ నాతఁడు వల్లెయని [4]నిత్యకృత్యోద్యముఁడగు నీలుని రప్పించి నలుదెసల వనచరులం బిలిపింప నానతిచ్చె. [5] అంత రాముఁడు వర్షరాత్రముల లక్ష్మణ సహాయుఁడై యటవసించి శరన్నిశల, విమలమగు చంద్రమండలమును గాంచి సీతావియోగమున విశేషకాలము గతించెనని మోహపరవశుఁడై కామవృత్తాసక్త చిత్తుఁడగు సుగ్రీవునిఁ దలఁచి, [6]'వర్షాసమయకాల మవధియొనర్చి నాల్గుమాసములు గడచినవనియుఁ దెలియక పానమున మైమఱచియుండు నతని కడకుంజని 'వాలిపోయినమార్గమింకను మూయఁబడలేదనియు కాలమునకు గట్టువడుమనియు, వాలిమార్గము ననుసరింపవలదనియు నుడువు'మనియు ననుజునకుం జెప్పెను. [7] అంత లక్ష్మణుఁడు కినుకనొంది, వానరుఁడు సాధువృత్తియందుండఁజాలఁడనియు కర్మఫలములఁ దెలియఁజాలఁడనియు,గుణరహితునకు రాజ్యమీయం దగదనియు నుడువుచు, కిష్కింధా ద్వారసమీపమున కరుదెంచి ధనుష్టంకా

---

(1) 4 27-6 ఇయంగిరిగుహారమ్యా।విశాలాయుక్తమారుతా। అస్యాంవసామసౌమిత్రే। వర్షరాత్ర మరింధమ।

(2) 4-29-1 సమీక్ష్య విమలంవ్యోమ । గతవిద్యుద్వలాహకం । సారసారవసంఘుష్టం । సమ్యగ్జ్యోత్స్నానులేపనమ్॥

(3) 4-29-19 తస్యత్వంకురువై కార్యం । పూర్వంతేనకృతంతవ । హరీశ్వరహరిశ్రేష్ఠా । నాజ్ఞాపయితు మర్హసి॥

(4) 4-29-30 ససందిదేశాతిమతిం। నీలంనిత్యకృతోద్యమం। దిక్షుసర్వాసుసర్వేషాం। సైన్యానాముపసంగ్రహే॥

(5) 4-30-1 వర్షరాత్రోషితోరామః। కామశోకాభిపీడితః । పాణ్డురం గగనందృష్ట్వా । విమలం చంద్రమండలం । శారదీంరజనీంచైవ । దృష్ట్వాజ్యోత్స్నానులేపనామ్ । బుద్ధ్వాకాలమతీతంచ । ముమోహపరమాతురః॥

(6) 4-30-78 వర్షాసమయకాలంతు । ప్రతిజ్ఞాయహరీశ్వరః । వ్యతీతాంశ్చతురోమాసా। న్విహరన్నావబుధ్యతే । సామాత్యపరిషత్క్రీడన్పానమేవోపసేవతే । ఉచ్యతాంగచ్ఛసుగ్రీవ । స్త్వయావత్సమహాబల । మమరోషస్యయద్రూపం । బ్రూయాశ్చైనమిదంవచః॥ నచసంకుచితఃపన్థా । యేనవాలీహతోగతః । సమయేతిష్ఠసుగ్రీవ । మావాలిపథమన్వగాః॥

(7) 4-31-2 నవానరస్థాస్యతిసాధువృత్తే। నమంస్యతేకర్మఫలానుషంగాన్। నభోక్ష్యతేవానరరాజ్యలక్ష్మీం । తథాహినాభిక్రమతేస్యబుద్ధిః । మతిక్షయాద్గ్రామ్యసుఖేషుసక్త। స్తవప్రసాదాప్రతికారబుద్ధిః । హతోగ్రజంపశ్యతువీరవాలినం । నరాజ్యమేవంవిగుణస్యదేయమ్॥

రముం జేయ నదరిపడి వానరరాజు, తానపుడే తెంచుట తగదని ప్రియురాలగు తార నుబంప నద్దానిచే శమితకోపుఁడగు లక్ష్మణుని డగ్గఱి వందనాదుల నొనర్ప హసన్ముఖుఁడుగనుండఁ దా [1] నదివఱకంపిన దూతల యుదంతంబేమియుఁ దెలియమి మఱల నంపుటకు గంధవహసూనుని కాజ్ఞయొసఁగి [2] పదిదినములలోన నచటికి రానివానరునకుఁ బ్రాణాంతికదండమని నుడివెను. అంత దూతలు నలుదెసలం జని యూథపతుల కాజ్ఞనెఱిఁగింప [3] రెండుగడియలలోన మరలి వెనువెంట సేనలనిడుకొని యొక్కుమ్మడి యూథపతులురా [4] లక్ష్మణుఁడు దాను నేకాందోళికారూఢులై రామసకాశమునకుంజని, యచట మార్గశిరాంతమున సేనల నలుగడలకు [5] నొకమాస (పుష్యమాసాంత) మవధిం జేసి యనిచి నియతకాలములోపల రానివానరులఁ దెగటార్చుటయే దండమని తెలుప వానరులందఱు అన్నిదిశలకుంజని వెదకి జనకజ నెచటఁ గానక పూర్వోత్తరపశ్చిమదిగ్గతు లగువానరు లేతెంచిరి. అనంతరము దక్షిణదిశకేఁగిన వానరులు వింధ్యగిరి యంతయు వెదకి యచట సీతను గానక నొకవృక్షమూలమున నాసీనులై చింతనొందు వానరులను 'జూచి [6] మనకు విశేషకాలము జరిగె నుగ్రశాసనుఁడగు సుగ్రీవునివలన భయముగలదుగాన వెదకుదము లెమ్మని యంగదుఁడు పలికె. అంత నందఱు వెడలి యచ్చటచ్చట వెదకుచు [7] నాపర్వతపు నైఋతిమూలకుం జని వెదకెడు వారలకు సుగ్రీవనియతకాల (ఒకమాసము) మంతయు నచటనె కడచె. అనంతరము [8] మయ మాయావిహితంబును నీరంధ్రతమోజాల

---

(1) 4-37-10 ప్రేషితాఃప్రథమంయేచ । మయాదూతామహాజవాః । త్వరణార్థంతుభూయస్త్వం । హరీంత్సంప్రేషయాపరాన్॥

(2) 4-37-12 అహోభిర్దశభిర్యేచ । నాగచ్ఛన్తిమమాజ్ఞయా । హన్తవ్యాస్తేదురాత్మానో । రాజశాసనదూషకాః॥

(3) 4-37-34 తేతుతేనముహూర్తేన । యూథపాశ్శీఘ్రగామినః । కిష్కింధాంత్వరయాప్రాప్తా । స్సుగ్రీవోయత్రవానరః॥

(4) 4-38-12 బృహద్భిర్హరిభిర్యుక్త । మారురోహసలక్ష్మణః । పాండురేణాతపత్రేణ । ధ్రియమాణేనమూర్ధని॥

(5) 4-40-70 ఊర్ధ్వంమాసాన్నవస్తవ్యం । వసన్వధ్యోభవేన్మమ । సిద్ధార్థాస్సన్నివర్తధ్వ । మధిగమ్యతు మైథిలీం॥

(6) 4-49-4 కాలశ్చనోమహాన్యాత । స్సుగ్రీవశ్చోగ్రశాసనః । తస్మాద్భవంతస్సహితా । విచిన్వన్తు సమన్తతః॥

(7) 4-50-3 ఆనేదుస్తస్యశైలస్య । కోటిందక్షిణపశ్చిమామ్ । తేషాంతత్రైవవసతాం । సకాలోవ్యత్యవర్తత॥

(8) 4-53-15 మయస్యమాయావిహితం । గిరిదుర్గంవిచిన్వతామ్ । తేషాంమాసోవ్యతిక్రాన్తో । యోరాజ్ఞాసమయః కృతః॥

నిలయము నగు బిలసమీపమున తరుజాలములు ప్రవాళ పుష్ప ఫల భరితములై శుకపికశారికా నికరముల కలకలం బతిరమ్యముగ వీనులకు విందొనరింప వసంతఋతువని యెంచి వితర్కించుచుఁ బిదప బిలములోనం జని తెరువెఱుఁగలేక యోగినిని బ్రార్థింప నది వీరలఁగొని వెలుపల ప్రవేశ మొనర్ప నచట సుగ్రీవనియతకాల మగు నొకమాసము గడచినదని పవనసుతుండు నుడువ సంతనందఱు ఖిన్నులై సముద్రతీరమునఁ బ్రాయోపవేశ మొనర్చుటయే గుణమని యెంచుచుండుతఱి సంపాతి యను గృధ్రరాజు వీరలయుదంతం బంతయు విని జానకివృత్తాంతంబును దెలిపెను. ఇంతపర్యంతము కాలనిర్ణయము చేయఁగఁ బూర్వోత్తర సందర్భములను బరిశీలించిన యెడ జ్యేష్ఠబహుళ పాడ్యమిదినమున మారుతి రామలక్ష్మణులను జూచుటయు సుగ్రీవసఖ్యాదులును ఆషాఢమాసమంతయు, వాలిహరణ సుగ్రీవాదుల పట్టాభిషేక కార్యమనియు, శ్రావణము మొదలు కార్తికాంతము రామలక్ష్మణులు గుహానుండుటయు, మార్గశిరమాసమున లక్ష్మణుని కోపము, సర్వవానరసమ్మేళనము, రామదర్శనాదులనియు, నామాసాంతమునఁ బుష్యమాస మవధింజేసి వానరులను సీతాన్వేషణమున కంపుటయు వారలలలో దక్షిణదిగ్గతులగు వానరులకు వింధ్యమున చాలఁ గాలము జరిగినదనుటవలనఁ బండ్రెండు దినములు లెక్కఁజేసి వింధ్యగిరి నైఋతి మూల నొకమాసమును బిలమున నొకమాసమునుగడువ మొత్తము రెండుమాసముల పండ్రెండుదినములను వెనుకటిసంఖ్యలోనం గూర్ప ఫాల్గునశుద్ధ ద్వాదశి పర్యంతముగ నేర్పడును. పండ్రెండుదినములని లెక్కవేయుట కేమికారణమని యడుగఁగలరు. ముందు సుందరకాండారంభ (మారుతి లంక కేఁగిన)దినము, తత్సమయసూచక వ్యంగ్యార్థములచే శుద్ధత్రయోదశి యని నుడువఁబడిన తత్పూర్వదిన పర్యంతము గణనఁజేయుట ముఖ్యముగాన నిటులు యోజింపఁబడియె. సీతావృత్తాంతము వినినపిదప వానరులు లబ్ధమనోరథులై సంతసమున నాస్ఫోటనాదులఁ జేసిరిగాని లవణపయోధిలంఘనమును గూర్చి మూలకొకఁడు ముడుఁచుకొని యుండియు జాంబవత్ప్రముఖవృద్ధవానరు లంగదుం బరివేష్టించి యుండునెడ నెవ రీశతయోజనాయతం బగుపారావారమును దాఁటి జనకజంగని రాఁగలరని యంగదుఁ డడుగఁ దమతమ సామర్థ్యముల నందఱుఁ జెప్పిరి; కాని హనుమయొకఁడుమాత్ర మేమియు ననక మిన్నకుండె. అంత జాంబవదాదు లీతని స్తోత్రము చేయఁ గాయంబు బెంచి, [1] వానరులదుఃఖాపనోదనముఁ జేయుచు నై దేహింం గని వచ్చెద మీరందఱు సంతసము నొందుఁడు. వాయుసమమగు వేగము గరుడతుల్యమగు జవమును గలనేను పదివేలయోజనముల దూరమయిన పోయి వచ్చెదనని నుడువ నందఱు సంతసించిరి.

(1) 4-67-28 అహం ద్రక్ష్యామి వైదేహీం । ప్రమోదధ్వంప్లవంగమాః । మారుతస్యసమోవేగే । గరుడస్యసమోజవే । అయుతంయోజనానాంతు । గమిష్యామీతిమేమతిః॥

కిష్కింధాకాండము సమాప్తము.

# సుందరకాండము.



అంత ననహాయశూరుఁ డగు సదాగతిసూనుండు సీతాదర్శన లాలసుఁడగుచుఁ దా నే చని రాఁగలనని నుడివి మహేంద్రాగ్రమునుండి యుప్పరవీథికిం గుప్పించి లంఘించు నెడ నచటిపాదపములు పుష్పితము లగుటం జేసి వాయుహతిం బలువిధముల ప్రసూనరాజి యనతిదూరంబు వెను వెంటఁ జనఁ జూపఱకు విద్యుద్గణపరీవృతమగు మేఘములవలెఁ దోఁప నతివేగమునఁ జను నెడ మైనాకుండు సరిత్పతిప్రేరితుఁడై యుపరితలంబునకుఁ బొడమి రామకార్యార్థియై చనునాతని కాతిథ్యాదిక మొనర్చి విశ్రాంతిపఱుప యత్నింప నతండు [1] తాఁ జేయుంబూనిన కార్యము తన్నుఁ ద్వరపెట్టుచున్నది. పగలును జరగిపోవుచున్న యది. మార్గమధ్యమున నిలువననియుం బ్రతిజ్ఞఁ జేసినవాఁడనుగాన నిటనుండఁ జనదని పలికి పోవుటయు నంత సిద్ధచారణగంధర్వ ప్రముఖులగు దేవతలండఱు నతనిం బరీక్షింపఁ దలఁచి నాగమాతయగు సురసకుం దెలుప నయ్యది సముద్రమధ్యమున భయావహమగు వికృతరాక్షసీరూపంబునఁ గన్పడ నద్దానిని లంఘించి పోవఁ బ్రయత్నింప నటులు చననీయక పరస్పరజయేషణులై యుపర్యుపరి దశయోజనోచ్ఛ్రిత కాయంబులం బెనుప నెట్టకేలకు నంగుష్ఠమాత్ర శరీరుఁడగుచు దాని వదనగహ్వరమునం జొచ్చి యధోముఖమున వెలువడి పోవు నతనిం గాంచి నంతసించి కృతకృత్యుఁడవు గమ్మని యాశీర్వదించి చన నతండును యథాపూర్వగమనంబునం బోవ ఛాయాగ్రాహిణియగు సింహిక యడ్డపడం దద్వివృతాస్యమార్గమున లోనికిం జని యద్దాని బ్రద్దలుగఁ జీరి చనుచున్న యతనిం గాంచి జయ జయశబ్దంబు లశరీరవాణు లందంద యుచ్చరింప శతయోజనాయతంబగు పారావారము ననాయాసముగ లంఘించి కేతకోద్దాలక నారికేళాది తరుజాలముల విలసిల్లు రత్నాకరప్రాంతను వేలాచలముపయిని దిగి సంక్షిప్తదేహుఁడై [2] సూర్యాస్తమయమున కెదురుచూచుచుండెను. అంతఁ బ్రదోషకాలమున వాయుసూనుండు గొంకక యతివేగమున నుఱికి విభక్తమగు రాజమార్గములచే సుందరమగు లంకను ప్రవేశించుతఱి [3] ఱిక్కల

---

(1) 5-1-138 త్వరతే కార్యకాలో మే । అహశ్చాప్యతివర్తతే । ప్రతిజ్ఞా చ మయా దత్తా । న స్థాతవ్యమిహాంతరే ॥

(2) 5-2-48 ఇతి సంచిన్త్య హనుమాన్ । సూర్యస్యాస్తమయం కపిః । ఆచకాఙ్క్షే తదా వీరో । వైదేహ్యా దర్శనోత్సుకః । సూర్యే చాస్తం గతే రాత్రౌ । దేహం సంక్షిప్య మారుతిః । ప్రదోషకాలే హనుమాన్ । తూర్ణమాప్లుత్య వీర్యవాన్ । ప్రవివేశ పురీం రమ్యాం । సువిభక్తమహాపథామ్ ॥

(3) 5-2-57 చంద్రోఽపి సాచివ్యమివాస్య కుర్వం । స్తారాగణైర్మధ్యగతో విరాజన్ । జ్యోత్స్నా వితానేన వితత్య లోక । ముత్తిష్ఠతేనైకసహస్రరశ్మిః ॥

రాయఁ డితనికిఁ జేయూఁతఁ జేయుపగిది ననేక కిరణములఁ జుక్కలనడుమ వెలుంగుచుఁ జంద్రికయనువితానముఁ బఱచి యాకసమున మీఁదిమీఁదికిం బ్రవేశించుచుండెను. [1]శంఖములను పాలను బోలిన తెల్లఁదనముచే వెలుఁగుచు నాకసము మీఁదిమీఁదికిం జనుడుచంద్రుని సరస్సునందు హంసనువలె నాకపివీరుండు చూచెననియు, [2]కౌముదీవితానము నంబరమంత వెదఁజల్లుచు విష్ణుపదమధ్యగతుండగు నంశుమంతునిఁ జూచెననియు గలదుగాన నస్తమయపర్యంతము వెలుపలనుండియు ప్రదోషసమయమున లంకను ప్రవేశించువఱకు చంద్రుఁడువిశేషకాంతి కలవాఁడుగ నుండెననియు, మీఁదిమీఁదికిఁ బోవ్రచుండెననియు, శంఖక్షీరసమానవర్ణములు గలవాఁడనియు వర్ణించినందున నస్తమయమునకు పూర్వమే యుదయింపనియెడల ప్రదోషసమయము(రాత్రి4గడియల) వఱకు మధ్యంగతుఁడుగ నుండజాలఁడుగాన పగ లిరువదినాలుగుగడియలకు నుదయించినయెడ చంద్రోదయానంతరము 10 గడియలకు(రాత్రి 4 గడియలకు)ఖగోళమున మీఁదిమీఁదికి రాఁగలవాఁడుగ నుండును. కాంతియు విశేషముగ నుండునుగాన యది యువ సం॥ ఫాల్గున శుద్ధ త్రయోదశియని నిర్ణయింపవచ్చును. ఒకవేళ తత్పూర్వము దశమి మొదలగు తిథులనుగాని తత్పరము చతుర్దశి మొదలగు తిథులనుగాని గ్రహించితిమా యొకవిధమున వ్యవధాన మధికముగను, ఇంకొకవిధమున వ్యవధానము లేకుండుటయుం గలుగును. లంకనుండి వాయుసూనుఁ డేతెంచినమఱుదినము యుద్ధయాత్రనిర్ణయమునకు విరోధము రాకుండ విచారించినచో నీత్రయోదశితిథియే యుక్తముగాన స్థిరపఱుపనైనది. అంత నాకొమ్మ ద్రిమ్మరి లంకయందుఁగలయం గ్రుమ్మరుటకుముందుగ లంకిణినిమర్దించి లోనం జనునెడ [3] యజ్ఞదీక్షితులును, జటాజినధారులును, స్వాధ్యాయనిరతులునగు యాతుధానులం గనుచుననంతరము ప్రహస్తాది సకలరాక్షసగృహంబుల వెదకియు నటఁ గానక రావణగృహంబునకుంజని యచటనుం గానక [4] యశోకవనప్రవేశకాల మపరరాత్రమాయె. ఆసమయమున వేదవేదాంగవేత్తలు, బ్రహ్మవర్చస్కులు నగు రక్కసుల బ్రహ్మఘోషములు వినంబడుటయు నటుపిమ్మట నశోకవనమునకుంజని శింశుపావృక్షాధస్స్థితయగు సీతనుంగాంచి

---

(1) 5-2-58 శంఖప్రభం క్షీరమృణాళవర్ణ । ముద్గచ్ఛమానం వ్యవభాసమానమ్ । దదర్శ చంద్రం సహరిప్రవీరః । పోప్లూయమానం సరసీవ హంసమ్॥

(2) 5-5-1 తతస్సమధ్యంగతమంశుమంతం । జ్యోత్స్నావితానం మహదుద్వమంతమ్ । దదర్శధీమాన్ దివిభానుమంతం । గోష్ఠే వృషం మత్త మివభ్రమంతమ్॥

(3) 5-4-15 దీక్షితాన్ జటిలాన్ ముండాన్ । గోజినాంబరవాససః । స్వాధ్యాయనిరతాంశ్చైవ । యాతుధానాన్దదర్శసః॥

(4) తథావిప్రేక్షమాణస్య । వనంపుష్పితపాదపం । విచిన్వతశ్చవైదేహీం । కించిచ్ఛేషానిశాభవత్ । షడంగవేదవిదుషాం । క్రతుప్రవరయాజినామ్ । శుశ్రావబ్రహ్మఘోషాంశ్చ । విరాత్రేబ్రహ్మరక్షసామ్॥

సంతసించి భాషింప నుద్యమించు నెడ రావణుండచటి కేతెంచుధ్వనివిని వృక్షాధి
రూఢుఁడై మఱుఁగియుండ నతండట కేతెంచి జనకజం బలు దెఱంగులదూఱి చనినం
తనె త్రిజట తనస్వప్నవృత్తాంతంబు వైదేహికిం దెలిపి యుదర్కసిద్ధియగునని నుడివి
న వెనుక నవరోహణంబొనర్చి [1] వినయవిధేయతల నెఱప నభివాదనమొనర్చి వృ
త్తాంతంబంతయు నెఱింగించి యంగుళీయకము నీయ నామెయు బహువిధముల నిత
నిం గొనియాడి చూడామణినిచ్చి వేచనుమన నటుసేయక తనరాక యాతుధాను
ల కెఱింగింపవలెననియు, పగలు లంకనంతయుఁ గనవలెననియు, నెంచి, వనభంగమొ
నర్చికింకరులం గూల్చి [2] ప్రాసాదభంజనం బొనర్చుతఱి నుదయుంబయ్యె. అనంత
రము జంబుమాల్యక్షకుమారాది త్రిభాగబలసంహారంబొనర్పఁ గినిసి మేఘనాదునంప
నతనిచే బ్రహ్మాస్త్రమునకుం బట్టువడ నంత రావణసదనమునకుం గొంపోవుటయునట
శ్రీరామునివీర్యమును, లక్ష్మణుని శక్తియు, సుగ్రీవుని శూరతయు, తనబలమును, తక్కుం
గలవానరుల పోఁడిమియు, నెఱుఁగం జేయఁ గోపోద్దీపితుండై యాతని వధింప దశవదనుండా
నతీయ ననుజుఁడగు విభీషణుఁడు దూతలవధించుట రాజునకుఁ దగని కార్యమనియు,
శిక్షింపవలసినచో వాలమునకు వస్త్రవేష్టనంబొనర్చి దగ్ధంబు చేయుటయె చాలునని
యుఁ జెప్పనటులు సేయ నా వానరశ్రేష్ఠుఁడూరక చనక నాయగ్నిజ్వాలలఁ [3] బ్రాసా
దాదుల నాశనమునకుం గారణంబు గావించి సముద్రమున నగ్గిం జల్లార్చి సీతయు ద
గ్ధయై యుండునని కుంది చారణులవలన క్షేమంబు దెలిసి, పునర్దర్శనంబు చేసి యానతిం
గొని యాక్షణమె యుత్తరతటంబునకుం జని యచటివానరులకీయుదంతంబు నివే
దించి యందఱొక్కుమ్మడి గగనచారులై చనిచని మధువనమున నాసవాదులం గొని
యాదినము (యువసం॥ ఫాల్గున శుద్ధ చతుర్దశి) సాయాహ్నమునకు ఋశ్యమూకముం
జేరి శ్రీరామునకు నుదంతంబంతయుఁ దెలివిడి చేయ మారుతిని నాలింగనమొనర్చి
చూడామణిం గైకొని కొంతతడవు విలపించి జనకజ యేమి చెప్పెనని మారుతినడుగ త
మరు చిత్రకూటమున నొకదినమున దనయుత్సంగమున సుఖసుప్తులైనతఱి కాకంబొ
కఁడు స్తనాంతరంబుల నోరంజీర మేల్కాంచి యంత నార్ద్రాపరాధంబగు నక్కాకం
బుపైఁ గినిసి దర్భనొకటి విసరివేయ నది బ్రహ్మాస్త్రమై వెంటనంటి బాధింపనయ్యదిము
ల్లోకంబు లల్లాడియు నెచటను రక్షకులంగానక తమసన్నిధానమునకే తెంచి పాదము

(1) 5-33-1 సోఽవతీర్య ద్రుమాత్తస్మా । ద్విద్రుమప్రతిమాననః । వినీతవేషః కృపణః । ప్రణి
పత్యోపసృత్యచ॥

(2) 5-43-4 ఆరుహ్యాగిరిసంకాశం । ప్రాసాదంహరియూథపః । బభౌసుమహాతేజాః । ప్ర
తిసూర్యఇవోదితః॥

(3) 5-55-1 లంకాంసమస్తాంసందీప్య లాంగులాగ్నింమహాబలః । నిర్వాపయామాసతదా । స
ముద్రేహరిసత్తమః॥

లపయింబడఁ జావుదప్పి కన్నులొట్టవ్రాయెనను విధమున [1]దానియక్షియుగమున నొకదానిం దదస్త్రమునకు నర్పించియధేచ్ఛంజనియె ననియు నిట్టిశూరులు రావణుని సపుత్రమిత్రబాంధవముగఁ బరిమార్చి నిరపరాధినగున న్నేలకొనిపోరనియు రావణుఁడిచటికి దన్నుఁదెచ్చి [2]పదియవమాసము జరుగుచున్నదియనియు [3] నిఁకనొకమాసమువఱకుఁ దమరాకకు వేచియుందుననియుఁజెప్పినన [4] విని వార్తను దెలిసియొకనిమునమైన నుండఁజాలనని నుడువుచు యుద్ధయాత్రకు త్వరపడుచు నారేయిగడపిరి.

---

(1) 5-67-16 భవాం స్తస్యాక్షికాకత్ స్థ । హీన స్తి స్తసదక్షిణమ్॥

(2) 5-37-8 ప ర్తతేదశమోమాసో ద్వౌతు శేషౌ ప్లవంగమ॥

(3) 5-65-24 జీవితంధారయిష్యామి । మాసందశరథాత్మజ । ఊర్ధ్వంమాసాన్నజీవేయం । రక్షసాంవశమాగతా॥

(4) 5-66-11 నయమామపితందేశం । యత్రనృష్టామమప్రియా । నతిష్ఠేయంక్షణమపి । ప్రవృత్తిముపలభ్యచ॥

సుందరకాండము సమాప్తము.



# యుద్ధకాండము.

అంత నామఋదినము (యువ సం॥ ఫాల్గున శుద్ధ పూర్ణిమ) న, శ్రీరాముఁడు మారుతివలన సీతవృత్తాంతమంతయు విని యతనిం బలువిధములఁ గొనియాడి యాలింగన మొనర్చి [1] వనచరులు పారావారము నెటులు దాఁటఁగలరని చింత నొందియుండుతఱి సుగ్రీవుఁ డరుదెంచి [2] సీతపోబలమున సేతువుఁగట్టియైనను నింకింపఁజేసి (శోషణ మొనర్చి)యైనను సముద్రమును దాఁట సమర్థుఁడవని తెలుపనంత ధైర్యము వహించి లంకలోపల దుర్గకర్తవిధానమంతయుఁ బవనసుతు నడిగి తెలిసికొని, [3] యినుండంబరమధ్యగతుండాయె నియ్యది విజయముహూర్తము గాన నీసమయమున యుద్ధయాత్రం జేయఁగోరెదననియు [4] నేఁడుత్తరఫల్గునీనక్షత్రము రేపు హస్తానక్షత్రము గును గాన సమస్తవానరబలములతోడ నిపుడు ప్రయాణ మొనర్చెదమనియు నుడివెను. లంకకు మారుతి రాక ఫాల్గునశుద్ధత్రయోదశి యనుటయు నామఋదినము (శుద్ధచతుర్దశి) సాయంతనమునకు వానరులు కిష్కింధను జేరి జనకజయుదంతంబు శ్రీరామున కెఱిఁగింప నామఋదినమున యుద్ధయాత్రకు వెడల నాదినము పూర్ణిమ యనుట నిస్సందేహము గదా! [5] అంత సుగ్రీవపాలితమగు నాసైన్యము మార్గమధ్యమున నెచటను గొంచు గడియలైన నిలువక రాత్రిందివము (రేయుంబగలు) చని, సముద్రతీరముఁ జేరి యొకచో మర్కటములు, నేఱొకచో భల్లూకము, లింకొకచో గోలాంగూలములునుగా విడిసినయవి. అనఁగ పూర్ణిమమధ్యాహ్నము తరలినసేన

---

(1) 6-1-19 సముద్రపారగమనే । హరీణాంకిమివోత్తరమ్ । ఇత్యుక్త్వాశోకసంభ్రాంతో । రామశ్శత్రునిబర్హణః॥

(2) 6-3-2 తపసా సేతుబన్ధేన । సాగరోచ్ఛోషణేనవా । సర్వథాసుసమర్థోస్మి। సాగరస్యాస్య లఙ్ఘనే॥

(3) 6-4-3 అస్మిన్ముహూర్తేసుగ్రీవ । ప్రయాణమభిరోచయే । యుక్తోముహూర్తోవిజయః । ప్రాప్తోమధ్యం దివాకరః ॥

(4) 6-4-6 ఉత్తరాఫల్గునీహ్యద్య శ్వస్తుహస్తేనయోక్ష్యతే । అభిప్రయామస్సుగ్రీవ సర్వానీకసమావృతాః॥

(5) 6-4-70 సాస్మయాతిదివారాత్రం । మహతీహరివాహినీ । హృష్టప్రముదితాసేనా । సుగ్రీవేణాభిరక్షితా । వానరాస్త్వరితంయాన్తి । సర్వేయుద్ధాభినందినః । ప్రమోక్షయిషవస్సీతాం । ముహూర్తంక్వాపినాసత॥

యారాత్రియంతయును పాడ్యమిసాయంతనము నడచెననుట.[1] అనంతరము కాంతి హీనుఁడై యినుండ స్తమింప లక్ష్మణునిచే నాశ్వాసితుఁడై రాముఁడు సంధ్యనుపాసించె. అనంతరము విభీషణశరణాగతియు శ్రీరాముని దర్భాస్తరణ శయనమును పూర్వరాత్రమున జరిగినకార్యములు. ఎటులనిన చతుర్దశ్యుదయమున వాయుసూతి లంకాదహనమొనర్చి మరలిచనన వెనుక రావణుఁడు సేయునదెద్దియుఁదోఁచక మిన్నకయుండె. మఱుదినము (పూర్ణిమ)నఁ బ్రహస్తాదిమంత్రిసత్తములను వృద్ధరాక్షసులను రావించి [2] యుద్ధమునందు విజయము మంత్రమూలమని పెద్దలు నుడివెదరు గాన రాముని గెలుచునుపాయం బాలోచింపుఁడని నుడువ నందఱొక్కమొగి నిటలతటఘటితాంజలులై యడిగినప్రశ్నమున కుత్తరంబీయక[3] దేవదానవగంధర్వ పిశాచపతగోరగులు దేవర నెదిరింపఁజాలక యందందయడఁగి యుండ వానరాధములనెంత యని నుడువుచు తమతమయాయుధముల వెలికిఁ దీయురక్కసుల నందఱ విభీషణుఁడు వారించి యాసీనులంజేసి [4] బహురత్నపూర్ణమును గజాశ్వయుతంబును నగులంక నెంతవఱకు రామబాణములు దగ్ధముగావింపవో యంతలోన మైథిలిని తిరిగి సమర్పింపుమని నుడువ నుత్తరం బీయకయ యంతిపురమున కేఁగె.[5] అనంతరదిన (పాడ్యమి) ముదయమున విభీషణుఁడగ్రజుగృహంబునకుంజని [6] వైదేహిని చటికిఁగొని వచ్చిన దాదిగ నశుభములు కానిపించుచున్నవి, కాన జనకజనంపుటయే గుణమని నుడువ నుత్తరంబీయక ననుజునంపి, సభామండపముఁ జేరి, రాక్షసానీకముల రావించి యాలోచనసేయఁ గడఁగుతఱి కుంభకర్ణుఁ డదివఱకు నిద్రఁగూరియుండినవాఁడు గానయాదినమతఁడు మేల్కాంచినపిదప రప్పించి[7] కార్యగతులు దెలిసికొన నశక్యములు గాన మీమీయిష్టానుసారముగ నుడువుఁడని రావణుండడుగ మోహితుండైన

(1) 6-5-22 దినక్షయాన్మందరుచి । ర్భాస్కరోస్తముపాగమత్ ।ఆశ్వాసితోలక్ష్మణేన। రామస్సంధ్యాముపాసత॥

(2) 6-6-5 మంత్రమూలం హివిజయం । ప్రాహురార్యామనీషిణః । తస్మాద్వై రోచయే మంత్రం రామంప్రతిమహాబలాః॥

(3) 6-8-2 దేవదానవగంధర్వా । పిశాచపతగోరగాః । నత్వాంధర్షయితుంశక్తాః । కింపునర్వానరా రణే॥

(4) 6-9-18 యానన్నసగజాంసాశ్వాం । బహురత్నసమాకులాం । పురీందారయతేబాణై । ర్దీయతామస్యమైథిలీ॥

(5) 6-10-1 తతఃప్రత్యుషసిప్రాప్తే। ప్రాప్తధర్మార్థనిశ్చయః । రాక్షసాధిపతేర్వేశ్మ। భీమకర్మా విభీషణః॥

(6) 6-10-14 యదాప్రభృతివైదేహీ। సంప్రాప్తేమాంపురీంతవ । తదాప్రభృతిదృశ్యంతే। నిమిత్తాన్యశుభానిచ॥

(7) 6-12-22 దుర్జ్ఞేయాః కార్యగతయో । బ్రూతయస్యయథామతి॥

రావణుని దుఃఖమును దెలిసి కోపమున [1] నీచేతఁగావింపఁబడిన యచింతిత కార్యమునకు రాముఁడు నీయదృష్టమున నినుఁజంపకున్నాఁడని పలువిధముల నిష్ఠురోక్తుల నుడివియు రాజాజ్ఞానుసారముగ శత్రువినాశనము దాన యొనర్తునని చెప్పె. అంత నీవచనములన్నియు విభీషణుఁడు విని [2] పర్వతకూట మాత్రప్రమాణ దేహులగు వానరులు లంకలోనఁ బరుగిడుటకు ముందుగ, రాముని బాణములు రక్కసులతలలఁ ద్రుంచుటకు ముందుగను మైథిలినిచ్చి వేయుమని హితవాక్యములఁ గొన్నిటిని నుడువ నంతయు విని [3] తమ్ముని ధిక్కరించి (నిందించి) కులపాంసనుఁడవు పొమ్మనియు, [4] నెల్లపుడు కలసి మెలసియుండి వ్యసనసమయమున వధోద్యుక్తులగు జ్ఞాతులు భయావహులను ననేక దురుక్తుల రావణుఁడు నుడువ విభీషణుఁ డాలించి '[5] నను విడిచి సుఖము నొందుము, నీకు మంగళము లగుఁ గాక పోఁగల' నని నుడివి [6] లక్ష్మణయుతుఁడగు రాముని కడకు ముహూర్తమాత్రము (రెండుగడియలలో)న నేఁగి [7] రావణుని చేఁ బరుషోక్తుల నుడువఁబడియు దాసునివలె నవమానింపఁబడియు దారపుత్రాదుల నెల్లర విడనాడి శ్రీరాముని శరణమొందిన విభీషణుఁ డిట కేతెంచె ననియు, సర్వజనశరణ్యుండగు శ్రీరామునకు శీఘ్రముగ నెఱిఁగింపుఁడనియు వేఁడుట పాద్యమిసాయంతనము వానరబలయుతుఁడై రాముఁడు సముద్రతీరమును జేరినక్షణమున జరగెను. [8] జన్మప్రభృతి పరదార పరద్రవ్యాపహారముల నెడు పాపముల కాకరుఁడగు రావణుని యనుజుఁడై నందున, నకా

(1) 6-12-34 త్వయేదమనహారబ్ధం । కార్యమప్రతిచిన్తితమ్ । దిష్ట్యా త్వాం నావధీద్రామో । విషమిశ్రమివామిషమ్ । అహముత్సాదయిష్యామి । శత్రూం స్తవవిశాంపతే । యదిశక్రవివస్వంతౌ । యది పావకమారుతౌ ॥

(2) 6-14-3 యావన్నలంకాం సమభిద్రవంతి । వలీముఖాః పర్వతకూటమాత్రాః । దంష్ట్రాయుధాశ్చైవనఖాయుధాశ్చ । ప్రదీయతాం దాశరథాయమైథిలీ ॥

(3) 6-16-15 అస్మిన్ముహూర్తేనభవేత్ । త్వాంతు ధిక్కులపాంసనమ్ ॥

(4) 6-15-5 నిత్యమన్యోన్యసంహృష్టా । వ్యసనేష్వాతతాయినః । ప్రచ్ఛన్నహృదయాఘోరా । జ్ఞాతయస్తుభయావహాః ॥

(5) 6-16-25 ఆత్మానంసర్వథారక్ష । పురీంచేమాంసరాక్షసామ్ । స్వస్తితేస్తుగమిష్యామి । సుఖీభవమయావినా ॥

(6) 6-17-1 ఇత్యుక్త్వాపరుషంవాక్యం । రావణంరావణానుజః । ఆజగామముహూర్తేన । యత్రరామస్సలక్ష్మణః ॥

(7) 6-17-14 సోహంపరుషితస్తేన । దాసవచ్చావమానితః । త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ । రాఘవంశరణంగతః । సర్వలోకశరణ్యాయ । రాఘవాయమహాత్మనే । నివేదయతమాంక్షిప్రం । విభీషణముపస్థితమ్ ॥

(8) 6-17-44 బద్ధవైరాచ్చపాపాచ్చ । రాక్షసేంద్రాద్విభీషణః । అదేశకాలేసంప్రాప్తస్సర్వథాశంక్యతామయమ్ ॥

లమందు, నదేశమందు సీతఁడిట కేతెంచుట చూడ నన్నివిధముల సందేహము క
లుగుచున్నదియని జాంబవంతుఁడనుడివె. అంత నంజనీసూనుం డవ్వాక్యములవిని
[1] రావణునియందు దుర్మార్గతయు, తన (రాముని) యందు శూరత్వమునెంచి విభీష
ణుఁడిట కేతెంచుటకుఁ దగిన దేశమును కాలమును నియ్యదియె యనుచు, తన
యుద్ధయాత్రోద్యోగమును, రావణునియం దసత్యవృత్తియు, వాలివధమును సుగ్రీ
వరాజ్యాభిషేకమును విని రాజ్యము కావలయునను నపేక్షచే బుద్ధిపూర్వకముగ న
తఁడిట కేతెంచెనని నుడువ వానరులందఱు సమ్మతింపకున్నను [3]మిత్రభావమున నే
తెంచిన వానిని విడనాడుటఁ దగదనియు దోషమున్నయెడ నతనిదేయగును, సత్పురు
షులకియ్యది నింద్యకార్యముగాన [4]విభీషణుఁడే కానిమ్ము, రావణుఁడే కానిమ్ము నావల
న నభయమునీయంబడియె, కాన నాయన నిటగొనిరమ్మని శ్రీరాముఁడు సుగ్రీవున
కునుడివెను. అంత నతనిఁదోడ్కొనివచ్చి రామసమీపమున విడుచుటయు నతనిశ
రణాగతియు, లంకలోని రాక్షసబలముల వివరము నతఁడు తెలుపుటయు మున్నగు
కార్యములు పూర్వరాత్రమున జరుగ [5]విభీషణుండు శ్రీరామునితో సముద్రమును శర
ణము నొందుమని నుడువ నాక్షణమె సముద్రతీరమున దర్భాస్తరణమున శయనిం
చె. [6] ఆరాత్రి మొదలు మూఁడురాత్రు (పాడ్యమిరాత్రి మొదలు తృతీయరాత్ర్యంత
ము) లప్రమత్తుఁడై యుండినను సముద్రుఁ డప్రసన్నుఁడై యుండ చవితిదిన ముద
యమున రాముఁడు కనలి కనులెఱ్ఱఁజేయుచు [7]విషసమానతీక్ష్ణములగు శరములఁ
జాపము నిటగొనిరమ్ము సాగరమును శోషింపఁజేయ వానరులు పాదచారులై పోవు
దురని లక్ష్మణునికిం జెప్ప నతండటుసేయ శరమును చాపమున సంధించినంతనే, మా

---

(1) 6-17-56 దౌరాత్మ్యంరావణేదృష్ట్వా। విక్రమంచతథాత్వయి। యుక్తమాగమనంతస్య సదృశం తస్య బుద్ధితః॥

(2) 6-17-64 ఉద్యోగంతవసంప్రేక్ష్య। మిథ్యావృత్తంచరావణమ్। వాలినశ్చవధంశ్రుత్వా। సుగ్రీవంచాభిషేచితమ్। రాజ్యంప్రార్థయమానశ్చ। బుద్ధిపూర్వమిహాగతః॥

(3) 6-18-3 మిత్రభావేనసంప్రాప్తం। నత్యజేయంకథంచన। దోషోయద్యపితస్యస్యా। త్స తామేతదగర్హితమ్॥

(4) 6-18-34 ఆనయైనంహరిశ్రేష్ఠ। దత్తమస్యాభయంమయా। విభీషణోవాసుగ్రీవయదివా రావణస్స్వయమ్॥

(5) 6-19-31 సముద్రంరాఘవోరాజా। శరణంగంతుమర్హతి। ఖానితస్సగరేణాయ మప్రమేయోమహోదధిః॥

(6) 6-21-10 తస్యరామస్యసుప్తస్య। కుశాస్తీర్ణేమహీతలే। నియమాదప్రమత్తస్య। నిశాస్తిస్రోతిచక్రముః॥

(7) 6-21-22 చాపమానయసౌమిత్రే। శరాంశ్చాశీవిషోపమాన్। సాగరంశోషయిష్యామి। పద్భ్యాంయాంతుప్లవంగమాః॥

నముద్రా సహితుఁడగు సముద్రుఁడు గడగడవడఁకుచు నుడిఁబడి యుల్లోలకల్లోలుఁడై దరిందాఁటి చనియు, నెట్టన సింధుగంగా ప్రభృతినదనదీనికర సేవితుండగుచుఁ జను దెంచి నమస్కరించి నలునిచే సేతుబంధ మొనర్చు నుపాయంబు వలికి వరములఁ బడసి నిజేచ్ఛంజన నపుడ సన్నాహంబొనర్చి [1] (1 దినము) యాపగలంతయుఁ జతుర్దశ యోజనములమేర సేతువునుగట్టి యారాత్రి సుఖముగ నిద్రంగూరిరి. అంత [2] (2 దినము) నైదవదిన (పంచమి) ముదయానంతరము సేతుబంధముగావింప సమకట్టి యాపగలంతయు నిరువదియోజనములును [3] (3 దినము) నాఱవుదినము (షష్ఠి) పగలంతయు నిరువదియొక యోజనములును [4] (4 దినము) నావలిదినము (సప్తమి) పగలంతయు నిరువదిరెండు యోజనములును [5] (5 దినము) నా కడపటిదినము (అష్టమి) దినమంతయు నిరువదిమూఁడుయోజనములును బంధింప నైదుదినముల నూఱుయోజనముల మేర ముగిసెను. ఇటు లతిమానుషప్రభావుఁడగు శ్రీరాముఁడు సేతుబంధము గావించి యా సాయంతన సమయమున సువేలాచలప్రాంతమున సేనల నిలిపియుండ సిద్ధచారణ గంధర్వులు ఋషులతో నేతెంచి శుభజలముల నభిషేకంబొనర్చి [6] చతుస్సముద్ర ముద్రితమగు మేదిని నాచంద్రార్కము పాలింతువు గాక యని యాశీర్వదించి తమతమ నెలవులకుఁ జనినయనంతరమున సేనల గరుడవ్యూహ ప్రకారముగ నిలిపియుండుతఱి శుకసారణు లనునిరువురురక్కసులు మ్రుచ్చులపగిది రావిభీషణుం డెఱిఁగింప వానరులు వారలం దెగటార్పఁ జూచునెడ నటులుగావింపనీయక తమ సన్నిధానమునకుఁ దోడితెండని రాముఁడానతీయ నెదుట వారల నిలిపిరి. [7] వారలతో నెల్లి (నవమి) ప్రొద్దువ్రేడమిన వెనుక లంకను ముట్టడింతుమనియు పాకశాసనుఁడు రాకాసులపై దంభోళినేయుపగిది వాఁడిములుకుల నేయఁ గలము

(1) 6-22-66 కృతానిప్రథమేనాహ్నా । యోజనానిచతుర్దశ॥

(2) 6-22-67 ప్రహృష్టైర్గజసంకాశై । స్త్వరమాణైఃప్లవంగమైః । ద్వితీయేన తథాచాహ్నా యోజనానితు వింశతిః ॥

(3) 6-22-68 అహ్నాతృతీయేనతథా । యోజనానికృతానితు । త్వరమాణైర్మహాకాయై । రేకవింశతి రేవచ ॥

(4) 6-22-69 చతుర్థేనతథాచాహ్నా । ద్వావింశతిరథాపిచ । యోజనానిమహాకాయైః । కృతాని త్వరితైస్తుతైః॥

(5) 6-22-70 పంచమేనతథాచాహ్నా । ప్లవగైఃక్షిప్రకారిభిః । యోజనానిత్రయోవింశ । త్సువేలమధికృత్యవై ॥

(6) 6-23-88 జయస్వశత్రూన్ నరదేవ మేదినీం । ససాగరాంపాలయశాశ్వతీస్సమాః । ఇతీవరామన్నరదేవసత్కృతం। శుభైర్వచోభి ర్వివిధైరపూజయన్ ॥

(7) 6-25-24 శ్వఃకాల్యే నగరీం లంకాం। సప్రాకారాం సతోరణామ్। రాక్షసంచబలంపశ్య । శరైర్విధ్వంసితంమయా । క్రోధంభీమమహంమోక్ష్యే । ససైన్యేత్వయిరావణ । శ్వఃకాల్యేవజ్రవాన్వజ్రం । దానవేష్వివవాసవః॥

గాన బలమును జూడుమని రావణునకుఁ జెప్పిసంప వారలాతుణమె చని యుదంతం బు రక్కసులతేని కెఱిఁగించిరి. [1] అనంతర మిచట వానరులు పర్వతారోహణముఁ జేయుదమనియు నీరేయి నిచటఁ గడపి యారక్కసిపక్కనము నావరింతమనియు నుడువుచుఁ గిచకిచలాడు [2] తఱి నినుండపరదిశ నలంకరించె. అంత సంధ్యారాగ రంజితమగు నాసమయమును నిండు వెన్నెలలఁ దులదూఁగెడుకాంతి గలదాయె. అనఁగ పూర్ణిమయని భ్రమనొందవలదు. ఫల్గునీ నక్షత్ర యుతమగు పూర్ణిమ విజయము హూర్తమున బయలు వెడలిన నొనిమిదవదినమునకుఁ బూర్ణిమ యనుకొటులు సంభ వించును. అంత వనచర బలయుతుఁడగు సుగ్రీవునితోడ శ్రీరాముఁడు పర్వతారోహణ ము చేయునపుడు [3] గోపుర శృంగస్థుఁ డగు రావణునిఁగాంచి సుగ్రీవుఁ డధికరోషమున మీఁదికి దుమికి కిరీటమును నేలంగూల్చి యశ్రమమున రామపార్శ్వముం జేరె. [4] అంత నారాత్రి యంతయు కదనోన్ముఖులై వానరులు నిద్రగూరిరి. [5] మఱుదిన (నవమి) ముదయానంతరము సేనలతోఁ బర్వతావరోహణం బొనర్చి లంకనుముట్టడిం చి ద్వారసంరోధన మొనర్చి [6] రాజధర్మమునుదలఁచి యంగదుని దౌత్యమునకఁ బంప నతఁడు చని రాక్షసరాజున కెఱుకఁజేసి విఫలమనోరథుఁడై తిరిగి వచ్చెడుసమయము తృతీయయామం బగుటయు నపుడు ద్వంద్వయుద్ధ మారంభమాయెను. తృతీయయా మానంతర మనుటకుఁ గతంబేమియని యడుగవచ్చును. [7] నిశినిశాచరులకు బల మధిక మగునుగాన రక్కసులు రవ్యస్తమయమున కెదురుచూచుచుండి రనుటం జేసి తృతీ

---

(1) 6-38-3 అధ్యారోహామహేసర్వే । వత్స్యామోత్రనిశామిమామ్ । లంకాంచాలోకయి ష్యామో । నిలయంతస్యరక్షసః ॥

(2) 6-38-18 తతోస్తమగమత్సూర్య । స్సంధ్యయాప్రతిరంజితః । పూర్ణచంద్రప్రదీపాచ । క్షపాసమభివర్తత॥

(3) 6-40-28 ఉత్పపాతతదాకాశం । జితకాశీజితక్లమః । రావణస్థితఏవాత్ర । హరిరాజేన వంచితః ॥ అథహరివరనాథః ప్రాప్యసంగ్రామకీర్తిం । నిశిచరపతిమాజౌయోజయిత్వాశ్రమేణ । గగన మతివిశాలం లంఘయిత్వార్కసూను । ర్హరివరగణమధ్యేరామపార్శ్వంజగామ ॥

(4) 6-39-1 తాంరాత్రిముషితాస్తత్ర । సువేలేహరిపుంగవాః । లంకాయాందదృశుర్వీరా । వనాన్యుపవనానిచ ॥

(5) 6-41-23 అవతీర్యచధర్మాత్మా । తస్మాచ్ఛైలాత్సరాఘవః। కాలజ్ఞోరాఘవఃకాలే। సంయుగా యాభ్యచోదయత్ ॥

(6) 6-41-59 విభీషణస్యానుమతే । రాజధర్మమనుస్మరన్ । అఙ్గదంవాలితనయం । సమా హూయేదమబ్రవీత్ । గచ్ఛసౌమ్యదశగ్రీవం । బ్రూహిమద్వచనాత్కపే॥

(7) 6-43-46 విదార్యమాణాహరిపుఙ్గవైస్తదా । నిశాచరాశ్శోణితదిగ్ధగాత్రాః । పునస్సుయు ద్ధం తరసాసమాశ్రితా । దివాకరస్యాస్తమయాభికాంక్షిణః॥

యయామమని నుడువవలసివచ్చె. [1] అంత నినుండస్తగిరిం జేరుటయు హరిరాక్షస సంకులమగు యుద్ధమధికమై యారేయి యుభయకులప్రాణాపహారిణి యై తనరె. అనంతరము నాగపాశములచే రామలక్ష్మణులు కట్టఁబడుటయు గరుడాగమనమును దన్మోచనమును నిశీథసమయమున జరగె. [2] ఆపద్విమోచనానంతరము నిశీథమున వానరులనాదము లతిధీరములుగ నుండెనని వర్ణనఁజేయ నావిధమున జెప్పఁ జనుఁగద! లోకములోఁ గష్టసమయమున హీననాదమును సుఖసమయమున ధీరనాదమును గలుగుననుట నెల్లరకుఁ దెలిసినవిషయమే! అనంతరము ధూమ్రాక్షవజ్రదంష్ట్రిల యుద్ధసమయమున పెంజీఁకటిని రూపములఁగానక వానరులు వానరులను రక్కసులు రక్కసులను జంపిరనుచు, వీరల మరణచరితమునుగూడఁ దెలుప నానమయముననే నీల్గిరని నుడువఁదగును. అనంతర మకంపనుని పోరాటమున [3] పరాగ మరుణవర్ణముగ నుండెననియు వనచరులును రక్కసులును రూపములఁ బరస్పరము తెలిసికొన జాలక సంకులముగఁ బోరుసలుపుచుండ [4] రక్తప్రవాహమున నాధూళి యంతయుఁ బోయినపిదప శరీరశవసంకీర్ణమై వసుంధరకనఁబడుటయు, నకంపనునిమరణమును నుడివినకారణమున, నిశీథమున ధూమ్రాక్ష వజ్రదంష్ట్రిల మరణానంతర మకంపనుని యుద్ధారంభము నరుణోదయ సమయమున నాతనిమరణమును జరిగెనని చెప్పఁదగును. అంత నవమిగతించె. ఫాల్గున బహుళదశమి ప్రొద్దువొడమినవెనుక నీయుదంతంబు రక్కసులు రాజున కెఱింగించుటయు నతఁడు సభామండపముఁ జేరి యుద్ధవిశారదుఁడగు ప్రహస్తునిఁ జూచి [5] నేనుగాని కుంభకర్ణుఁడుగాని సేనాపతి యగు నీవుగాని యింద్రజిత్తుగాని నికుంభుఁడుగాని యీభారమంతయు వహింప నాపత్కాలమున నిస్సంశయముగ జయము నొందఁగలము గాన నీవు సంగరమున కొడిగట్టవలయునని చెప్ప నతఁడు వల్లెయని యపుడ చతురంగబలముల నెంటనిడుకొని యేతెంచి యుద్ధమొనర్చి ప్రాతఃకాలమున యమపురికరిగె. అంత

(1) 6-44-1 యుధ్యతామేవ తేషాంతు తదావానరరక్షసామ్ । రవిరస్తంగతో రాత్రిః ప్రవృత్తా ప్రాణహారిణీ। అన్యోన్యంబద్ధవైరాణాం । ఘోరాణాంజయమిచ్ఛతాం । సంప్రవృత్తంనిశాయుద్ధం । తదావానరరక్షసామ్॥

(2) 6-50-65 తతస్తుభీమ స్తుములోనినాదో । బభూవశాఖామృగయూథపానామ్ క్షయేనిదాఘస్యయథాఘనానాం । నాదస్సుధీరోనదతాంనిశీథే॥

(3) 6-55-18 రజశ్చారుణవర్ణాభం । సుభీమమభవద్భృశమ్ । ఉద్ధూతంహరిరక్షోభి । స్సంరురోధదిశోదశ । సంవృతానిచభూతాని । దదృశుర్నరణాజిరే । ఆయుధంస్యందనంవాపి । దదృశేతేన రేణునా॥

(4) 6-55-24 తతస్తురుధిరౌఘేణ। సిక్తంవ్యపగతంరజః। శరీరశవసంకీర్ణా। బభూవచవసుంధరా॥

(5) 6-57-6 అహంవా కుంభకర్ణోవా । త్వంవా సేనాపతిర్మమ । ఇంద్రజిద్వానికుంభోవా । వహేయుర్భారమీదృశమ్ ॥

నీయుదంతంబు తక్కుంగల రక్కసులు తేనికిఁ దెలుపఁగ నతిఖిన్నుఁడై క్రోధ మురెట్టింప [1] స్వయముగ సేనలఁగూడి రా [2] దురమున రాముఁడు కిరీటభంగముఁ గావింప లజ్జితుఁడై యటనిలువక గృహమునకరిగి మంత్రులరావించి యతిఖేదమున [3] మహేంద్రసముఁడగు నేనొకమానిసిచే జయింపఁబడితినని పలికి భయస్వాంతుఁడగుచు సోదరునిఁ గుంభకర్ణుని మేల్కొలుప నానతీయఁ బరిజనులటు సేయ నతఁడు సభనలంకరించెను. ఇచటఁ గుంభకర్ణుని నిద్రనుగూర్చి విచారింపవలయును. [4]ఇతఁ డాఱు మాసములు నిద్రించుననియు నొకదినము (రాత్రిందివము) మేల్కాంచి యుండుననియు విభీషణుఁడు రామునకుఁజెప్పె. [5] ఈతని నిద్రాకార్యమున కిది తొమ్మిదవపగలు జరుగుచున్నది యని రావణుఁడు రక్కసులకుఁ జెప్పె. ఎటులనిన, ఫాల్గున బ 1 దినమున శ్రీరాముఁడు వానరసైన్యయుతుఁడై సముద్రతీరమున కేతెంచినదినము రావణుఁడాలోచనఁజేయు సమయమున నితఁడు మేల్కొని యుండినవాఁడు గనుక నగ్రజునకు హితములఁగొన్నిటి నుడివె. ఆదినముననే విభీషణుఁడు హితమును జెప్పటయు రావణుఁడు వానిని జెవినిడక తమ్ముని నిందించిన తోడనే రాముని శరణుఁజొచ్చె. కాన నాదినము (పాడ్యమి) మొదలు మూఁడు దినములు దర్భాస్తరణ శయనము చవితిమొదలష్టమి సాయంకాలము వఱకు సేతుబంధము, నవమి యుద్ధారంభదినము, కుంభకర్ణుని మేల్కొలుపు దినము దశమిగాన, పదిదినములలోఁ బ్రథమదినమున నాలోచన నుడివెను గాన ద్వితీయదినమున నిద్రకుఁ జనిన కారణమున నీదినము తొమ్మిదవ పగలని స్పష్టపడుచున్నది. ఇఁక నితని యుద్ధవిషయమును వివరింపవలయు. ఆతం డటు మేల్కొలుపఁ బడి రావణు సదనమునకుఁ జని యొకకొంత వాదంబుఁ గడపి వెలికిఁ జని [6] ముహూర్త (రెండుగడియలు) కాలము రణమొనర్చి యందఱఁ దపింపఁ జేసి శ్రీరామునిచేఁ జిచ్చునఁ గాల్పఁబడిన చెట్టువలె నీల్గె. అనంతరము, త్రిశిరో దేవాంతక నరాంతక కాతికా యాదులగు కుమారుల వధ

(1) 6-59-5 సోహంరిపువినాశాయ । విజయాయావిచారయన్ । స్వయమేవ గమిష్యామి । రణశీర్షం తదద్భుతమ్ ॥

(2) 6-59-144 సఏవముక్తోహతదర్పహర్షో । నికృత్తచాపశ్చ హతాశ్వసూతః । శరార్దితః కృత్త కిరీటకూటో। వివేశలంకాం సహసాసరాజా ॥

(3) 6-60-5 సర్వంతత్ఖలు మేమోఘం । యత్తప్తంపరమంతపః । యస్సమానోమహేంద్రేణ । మానుషేణాస్మినిర్జితః ॥

(4) 6-61-28 శయితాహ్యేషషణ్మాసా । నేకాహంజాగరిష్యతి ॥

(5) 6-60-17 మంత్రయిత్వాప్రసుప్తోయ । మితస్తునవమేహని ॥

(6) 6-67-3 ప్రతపిత్వాముహూర్తంతు । ప్రశాంతో రామతేజసా । కాయేనార్ధ ప్రవిష్టేన । సముద్రం భీమదర్శనమ్ ॥

యంతయుఁ బగలిరువదిరైదు గడియలకు ముందుగనే చేయఁబడెను. [1] పిదప సా
యంకాలపర్యంతము మేఘనాదుఁడు (ఇంద్రజిత్తు) దుర మొనర్చి డెబ్బదియాఱుకోట్ల
వానరులఁ బగటి యైదవ శేషకాలమునఁ (6 గడియలలో)బరిమార్చి రామలక్ష్మణుల
బ్రహ్మాస్త్రమునఁ గట్టువఱిచి రాత్రిలంకకుఁజనెను. అనఁగఁ బగలు ముప్పదిగడియల
కాలమున ప్రాత స్సంగవ మధ్యాహ్న పరాహ్ణ, సాయాహ్నములని పేర్కొనఁబడు
నైదుకాలములలోనైదవభాగమగు సాయాహ్నసమయమున యుద్ధముఁజేసి జయము
నొంది చనెనుగాన తత్పూర్వ మిరువదినాల్గుగడియలలో ప్రాతఃకాలమునఁ బ్రహ్మాస్త్ర
వధయు ననంతరము రావణకిరీట భంగ కుంభకర్ణ మరణములును జరుగ, సంగవ
కాలాత్పరము సాయాహ్నకాలాత్పూర్వము పండ్రెండు గడియలలోనఁ గుమారుల
వధయని స్ఫురించుచున్నది. [2] అస్తమయానంతరము హనుమద్విభీషణు లిరువురు ను
ల్కా (కాగడా) హస్తులై రణరంగ మంతయు వెదకి జాంబవద్వచనమున నోషధి
పర్వతము దెచ్చెడు సమయమున సద్దుపాటొనర్చిన దేవతల నదలించి యతిత్వరతో
వాయుసుతుఁడు దెచ్చి సకలవానరులు బ్రతికిన వెనుక నచ్చోటనే వైచివచ్చి రామ
పార్శ్వస్థితుఁ డాయెను. ఇదియంతయుఁ బూర్వరాత్రమున జరిగినకార్యమని నిశ్చయ
ము చేయఁదగు. అంతదూరముపోయి పర్వతమునుదెచ్చి వనచరులఁ బునర్జీవితులఁ
జేసి మరలి యథాస్థానమున నగ్గిరినుండి వచ్చుట యను నీ మహత్కార్య మింతస్వల్ప
కాలమునసై యుండునా యను సందేహము కలుగకమానదు. సూక్ష్మదృష్టిని విచా
రించినయెడ నొక లౌకికదృష్టాంతమున నీసందియ మడఁగు. దానినీక్రిందవివరించెద..

విజయనగరమను పత్తనమున నొకజననిగర్భమున నవమాసములుండి పిదప
భూపతితుఁడై దినక్రమమున వృద్ధినొంది తనవయఃకాలమున, వారణాసి (కాశీ)
ప్రయాగ (అలహాబాదు) లవపురము (లాహోరు) కాళీఘట్టము (కలకత్తా) మొద
లగు మహాపట్టణముల నుత్సవసమయమందు భూమిపైని దాఁ బరుండి, తనపై పెద్ద
పెద్దఱాలను వేయించుకొని వాని నితరులచే బ్రద్దలుగఁ గొట్టించుటయు, నినుపగొలు
సులఁ ద్రెంపివేయుటయు తనపై నొకసజీవమగు నేనుఁగును నడపించుటయు, పం
డ్రెండుజనములతో నిండియుండు మనదేశపుబండి (రెండుయెడ్లనుకట్టుబండి) నిపై
నుంచి యీడ్పించుకొనుటయు, నిరువది గుఱ్ఱములబలముగల యొకవైద్యుత
యాంత్రికశకటము నిండుపరుగున వచ్చెడు సమయమున ప్రాణభయమని జంకక
నొకభుజమున డీకొని యాబండిని నాఁపుటయు మొదలగు ననేకాతి మానుష

(1) 6-74-12 సప్తషష్టిర్హతాః కోట్యో । వానరాణాంతరస్వినాం । అహ్నః పంచమశేషేణ । వల్లభేనస్వయంభువః ॥

(2) 6-74-7 తావుభావుయుగపద్వీరౌ । హనుమద్రాక్షసోత్తమౌ । ఉల్కాహస్తౌతదారాత్రౌ । రణభూమౌవిచేరతుః ॥

కృత్యముల నొనర్చు కోడి రామమూర్తి నాయుడుగారిని దృష్టాంతముగ గ్రహించిన నాంజనేయు నధిక్షేపించు నవనాగరికుల సందియము లడఁగిపోవును.

సామాన్య నరునియం దిట్టియతిశయమును మనము కనులారఁ జూచుచుండ నవతారము లని నుడువఁబడు వారల విషయమున సందియ మొందుట చాల వెఱ్ఱితనము. ఇఁక నాకు సందేహనివృత్తి యయినది గాన ముం దంజవేయుదును. మనసుకంటె నతివేగవంతుండని నతనిని నచ్చటచ్చట వర్ణించియుండుటచే నిశ్చయముగ నిశ్కార్య మాయనవలన జరిగినదనుటయె నిశ్చయము. ఇంతియకాక [1]లక్ష్మణ పతనసమయమున కాలవిలంబమున దోషమును గష్టమును సంభవించునని యెంచి వాయుసూనుఁ డతివేగమునఁ జని పర్వతమును దెచ్చెననియుఁ గలదు. [1]ఆతఁడు సప్తాశ్వమార్గగామియై మార్తాండతేజఃతుల్యమగు నాశిఖరమును దెచ్చుతఱి సూర్యప్రకాశమున రెండవసూర్యునివలె ప్రకాశించె ననుచోటను [2]నాయోషధ పరిమళమున నిద్రంగూరిన జనులు మేల్కాంచినటులు తెలిపినొంది రనుచోటను నర్థవిషయమును చింతించి సూర్యోదయానంతర మోషధిపర్వతానయన మని చెప్పంజనదు. కుంభనికుంభులయుద్ధము రాత్రియందని వర్ణింపఁబడినందున నామఱుదినము (ఏకాదశి) అని యనుకొంటిమా మూఁడహోరాత్రములు యుద్ధమొనర్చి త్రయోదశ్యపరరాత్రమున వధింపఁబడిన నింద్రజిద్విషయము విరోధముగనుండును. కుంభనికుంభుల యుద్ధమునకుఁ బూర్వమే యోషధి పర్వతానయనము గాన దశమిరాత్రియందే పర్వతమును దెచ్చి వానరుల నందఱిని వెదకి పునర్జీవితులుగఁ జేయుట పూర్వరాత్రకృత్యము. ప్రతిభాస్కర శబ్దమువలనఁ గలిగిన సూర్యోదయ మనుసందేహము, పర్వతమును నాంజనేయులును నెఱుపుపసుపు గలసినవర్ణముగనుండుటచే నుపమావాచకముగ నెంచిన సమ్మతముగ నుండు. రాత్రి నిద్రగూరిన జనులుదయమున మేల్కొనినట్లనుట యోషధిప్రభావసూచకముగ గ్రహింపవలయు. [3] అస్తమయానంతర ముల్కాహస్తులగు వానరులు లంకాభిముఖులరై చని వెదకిరనుట దశమి సాయాహ్నమున నింద్రజిద్యుద్ధము వానరనాశనమును నస్తమయానంతరము వానరుల వెదకుటయు నంత జాంబవద్వాక్యమున నోషధి పర్వతముఁ

(1) 6-102-28 కాలాత్యయేనదోషస్స్యా । ద్వైక్లబ్యంచమహద్భవేత్ । ఇతి సంచింత్యహనుమా । న్క్షిప్రంగత్వామహాబలః ॥

(1) 6-74-70 సభాస్కరాధ్వానమనుప్రపన్న । స్తంభాస్కరాభంశిఖరంప్రగృహ్య । బభౌతదా భాస్కరసన్నికాశో । రవేస్సమీపేప్రతిభాస్కరాభః ॥

(2) 6-74-75 సర్వేవిశల్యావిరుజఃక్షణేన । హరిప్రవీరా నిహతాశ్చ యేస్యుః । గంధేనతాసాం ప్రవరౌషధీనాం । సుప్తానిశాంతేష్వివసంప్రబుద్ధాః ॥

(3) 6-75-4 తతో స్తంగత ఆదిత్యే । రౌద్రేతస్మిన్నిశాముఖే । లంకామభిముఖాస్సోల్కాః । జగ్ముస్తే ప్లవగర్షభాః ॥

దెచ్చి వానరుల జీవింపఁ జేసి మరల నచట నుంచుటయు ననునవి పూర్వరాత్రి కృత్యములుగ స్థిరపఱుపఁబడినవి. నిశాముఖే అనుశబ్దమున నాంజనేయుని వేగాతిశయసూచనయుం గూడఁ గలదు. [1] సంగరమున కుంభకర్ణుఁడీల్గె; కుమారులు హతులైరి గాన పుత్రభ్రాతృవధాదులఁ గుందెడు రావణుఁడు భయస్వాంతుండై యుద్ధమునకు రా శంకించును గాన లంకనుండి రాక్షసనిర్గమనమునకు లఘుశరీరులు మహాబలులునగు వానరులంద ఉల్కాహస్తులై సదనములనుండి వెడలఁగొట్టుఁడని సుగ్రీవుం డంజనీసుతున కాజ్ఞాపింప నపుడ లంకాదహనము గావించిరి. అనంతరము కుంభనికుంభయూపాక్ష శోణితాక్ష ప్రజంఘాదులు వెలికిరాఁ, బోరాట మంకురించె. [2] ఆసమయమున చంద్రకాంతియు నక్షత్రములశోభయు, వీరలు ధరించిన యాభరణముల ప్రభయు, ప్రాసాదాదుల రుచియుం గలసి హరిరాక్షస సైన్యముల విశేషముగఁ బ్రకాశింపఁ జేసె ననుటవలన నాదినము కృష్ణపక్ష దశమిగాన రాత్రి యిరువది గడియలకుఁ జంద్రోదయ మైనందున మధ్యరాత్రమున యుద్ధారంభము నపరరాత్రమున వీరల వధయు జరిగినదని మనచదువరులే దృఢముగ జెప్పఁగలరు. [3] అనంతర మేకాదశి యుదయమున నంబరగతుఁడగు నింద్రజిత్తు చక్షుర్గోచరుఁడు గాక యే శ్రీరామ లక్ష్మణులను వానరసైన్యముల నంపతంపరల చే నొంప, [4] లక్ష్మణుఁడు కోపసంరక్తలోచనుఁడగుచు సర్వరాక్షస నిర్మూలనముం జేయు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెదనని జ్యేష్ఠునకుం జెప్ప [5] నొకరక్కసునిఁ గూర్చి యందఱ సమసింపం జేయుట యశాస్త్రీయమనియు, యుద్ధముచేయనివానిని దాఁగినవానిని, శరణాగతుఁడైనవానిని, పాఱిపోయినవానిని, జంపంజనదనియు, నతితీక్ష్ణములగు బాణముల నాతని నొంప యత్నింతమనియు, నంతరితరథుఁడును మాయకుఁడు నగు నీతని వానరులు చూచిన విఱువఁజాలరనియుఁ జెప్పి తద్యత్నము వీరలుచేయుతఱి నాతండు (ఇంద్రజిత్తు) లంకాప్రవేశ మొనర్చి రక్కసుల నాశ

(1) 6-75-2 యతోహతఃకుంభకర్ణః। కుమారాశ్చనిషూదితాః। నేదానీముపనిర్హారం। రావణో దాతుమర్హతి ॥ 3 యేయేమహాబలాస్సంతి। లఘవశ్చప్లవంగమాః। లంకామభ్యుత్పతన్త్వాశు। గృహీత్వోల్కాఃప్లవగర్షభాః ॥

(2) 6-75-57 చంద్రాభాభూషణాభాచ। గృహాణాంజ్వలతాంచభా। హరిరాక్షససైన్యాని। భ్రాజయామాససర్వతః ॥

(3) 6-80-22 సతువైహాయసంప్రాప్య। సరథోరామలక్ష్మణౌ। అచక్షుర్విషయేతిష్ఠ। న్వివ్యాధనిశితైశ్శరైః ॥

(4) 6-80-37 లక్ష్మణస్తుసుసంక్రుద్ధో। భ్రాతరంవాక్యమబ్రవీత్। బ్రాహ్మమస్త్రం ప్రయోక్ష్యామి। వధార్థంసర్వరక్షసామ్ ॥

(5) 6-8-39 నైకస్యహేతోరక్షాంసి। పృథివ్యాంహంతుమర్హసి। అయుధ్యమానంప్రచ్ఛన్నం। ప్రాంజలింశరణాగతం। పలాయంతంప్రమత్తంవా। నత్వంహంతుమిహార్హసి। అస్యైవతువధేయత్నం। కరిష్యావోమహాబల ॥

నముంగూర్చి చింతనొంది రోషారుణిత నయనుండగుచుఁ బశ్చిమద్వారమున బలయుతుఁడై బయలువెడలి హనుమత్ప్రముఖ వానరులందఱు గనుచుండ మాయాసీతవధం జేసి నికుంభిలాప్రవిష్టుఁడై హవనక్రియం జరపుచుండె. ఇచట సీతావధమునుగాంచిన వానరులు విషణ్ణవదనులై రామునకుం దెలుప నిర్జీవుఁడయి యెట్టకేలకుఁ దేఱిచూచు నంతనె విభీషణుఁడే తెంచి మేఘనాదు (ఇంద్రజిత్తు) ని మాయాకృత్య మియ్యదియనియు నాతండిపుడు నికుంభిలాప్రవిష్టుఁడై హోమంబుఁ జేయుచున్నవాఁడనియు నయ్యది నిర్విఘ్నముగ జరిగిన నతండేరికి నజయ్యుండనియుఁ దెలిపి లక్ష్మణునితోడఁగూడి తద్భంగ మొనర్పఁ జని విఘ్నంబుఁ గావించియు నది మొదలు మూఁడహోరాత్రములు ఘోరయుద్ధము జరుగ నతండీల్గె. [1] మూఁడుదినములనుటకు యుద్ధమొనర్చుచున్న వారలకు గొప్పకాలము జరిగెనని యొక సర్గయందే రెండుమాఱు లుండుటవలన రెండ రోజులనియు,[2] మూఁడవదినమున యుద్ధమునందన రథము నశింప ద్వితీయ రథానయనము కొఱకు లంకకుఁ జనువెడ దిశలన్నియు దట్టముగు చీఁకటిని బిక్కటిల్లి యుండెననుటచే మూఁడవదిన మర్ధరాత్రసమయమనియు గ్రహించి యనంతరము రావణాత్మజుఁడు హతుఁడై ధరణిపయిం బడెననుట నాయపరరాత్రమున మరణము నిశ్చయమనినుడువుటకు [3] వీరుఁడగు నింద్రజేత నెట్టన మూఁడహోరాత్రములకు వధింపఁబడెనను శ్రీరామోక్తి ననుసరించియు సందర్భవిరోధము లేకుండ గణింప నేకాదశ్యుదయము మొదలు త్రయోదశ్యంత మీతని యుద్ధమనియు నాదినాంతమున నతని మరణమనియుఁగూడఁ జదువరులు తెలిసికొనఁ జాలుదురు. ఇంకొక యంశమును గూడఁ జర్చింతము. ఇంద్రజిన్మరణానంతరము రక్కసులు జేనికిం దెలుప నతం డనేకవిధములఁ బ్రలాపంబు లొనర్చి రాక్షసహరణమునకు వైదేహియె కారణమని మదినెంచి యద్దానిం ద్రుంప యత్నింప సుపార్శ్వుం డితనిని వారించి ' [4] యిపుడు కృష్ణపక్ష చతుర్దశి ప్రారంభము. రేపమావాస్య గాన బలయుతుఁడవై విజయముకొఱకు బయలువెడలి రణరంగమున రాముని గెలిచి జనక

---

(1) 6-89-27 తయోరథ మహాన్ కాలో । వ్యత్యయాన్యుధ్యమానయోః । నచ తౌ యుద్ధవైముఖ్యం । శ్రమం వాప్యుపజగ్మతుః ॥

6-89-41 తయోరథ మహాన్ కాలో । వ్యత్యయాద్యుధ్యమానయోః । నచ తౌ యుద్ధవైముఖ్యం । శ్రమం వాప్యుపజగ్మతుః ॥

(2) 6-91-5 తమసా బహులే నేమా । స్సంసక్తాస్సర్వతో దిశః । నేహ విజ్ఞాయతే స్వో వా । పరో వా రాక్షసోత్తమాః । ధృష్టం భవన్తో యుధ్యన్తు । హరీణాం మోహనాయ వై । అహం తు రథమాస్థాయ । హ్యాగమిష్యామి సంయుగమ్ ॥

(3) 6-92-16 అహోరాత్రైస్త్రిభిర్వీరః కథంచిద్వినిపాతితః ॥

(4) 6-93-65 అభ్యుత్థానం త్వమద్యైవ । కృష్ణపక్షచతుర్దశీం । కృత్వా నిర్యాహ్యమావాస్యాం । విజయాయ బలైర్వృతః ॥

జ నొందు'మని నుడివె. కాన నిందఱి వత్సరణాంతర మవిలంబముగఁ గృష్ణపక్ష చతుర్దశి రాఁగఁ దత్పూర్వము త్రయోదశి యనియు, తదాదిగ విలోమముగ మూఁడుదినములు గణుతిఁజేయ నేకాదశి యితని యుద్ధారంభదినమనియు, కృష్ణపక్షమనుట నన్నిటం దగినప్రమాణముగఁ గన్నట్టును. ఇంతియేకాక రామ రావణయుద్ధ మమావాస్య రేయుం బవలనియు రాత్ర్యంతమున రావణుని మరణమనుటకుం గూడ సహాయముగ నున్నయది. అనంతరము రావణుఁడు సభాసదనమునకుం జని దుఃఖితుఁడగుచు రక్కసులకు నంజలియొనర్చి మీరలందఱు రథగజతురగ పదాతులం గూడియుంటిరి గాన నపరిమిత శరవర్షములం గురిపించి నరరాజులను వానరసమూహముతోన జముని సదనమునకుం బంప సమర్థులరుగాన యత్నింపుఁడు. [1] అటుగానిచో జనులందఱుఁ దిలకించుచుండ నేనొకఁడను మీసహాయమున రేపు లయమొనర్చెదనని నుడువ పరిఘపట్టిస శరాద్యాయుధయుతులై రక్కసులందఱు వానరులపయిఁ బడి నుగ్గునూఁటాడ ఫలవృక్షములకుం బక్షులు గుమిగూడి చను నటు లొకరక్కసునకు నూర్గురువనచరుల వంతున జుట్టును ముట్టి బాధించిన నోర్చియు నసురులచే వనచరులు పీడితులై దశరథసుతుని శరణువేఁడ నతడు సింగిణిం జేఁబూని కోలలం బవనుఁడు వనమునఁ దరుజాలములఁ జీకాకుచేయుపగిది నదలింపం జెదరియు, బెదరియు, మ్రగ్గియు నేయెడఁగాంచిన రాముండు గన్పట్టునటులు దోఁప గాంధర్వాస్త్రమునం [2] బదివేల యనీకముల రథంబులును, పదునెనిమిదివేల యనీకముల గజములును, పదునాల్గువేల యనీకముల హయములును, రెండులక్షల యనీకముల కాల్బలమును దివసాష్టమ భాగము ($3\frac{1}{2}$ గడియ) న నంతము గావింప హతశేషులగు రక్కసులు లంకకుం జనినతోడనే లలనాజనసంకులంబు కలంకఁజెంది దుర్ముఖియగు శూర్పణఖ సుముఖుఁడగు రామునినేల గామించె, విఫలంబగుడు నంతం జనక ఖరదూషణాదులం బురికొల్పఁ దురమున వారలీల్గుట నిదర్శనముగ నుండ రాముసతి సీతం డేల చెఱగొనె, వెండియు సీతనిమ్మని విభీషణుఁడు వలుక నటులు సేయక యాతనిని విడనాడుటయుం జూడఁ దనగృహంబునకుం జిచ్చుదా నిడుకొనుచందమాయె; సీతనింబట్టి మనకు నిట్టిశోకంబు వాటిల్లెనయ్యో! నాథవుండీల్గె, నాతండ్రి యంతమునొందె, నాసుతుఁడు మృతుండాయె. నను శబ్దము లెటుఁజూచిన వినంబడుట యేకాక యువతీజనపరిదేవనంబు నా రాత్రియంతయును విని మఱునాఁడుదయమున (అమావాస్య) మహోదర మ

(1) 6-94-5 అథవాహం శరైస్తీక్ష్ణైర్భిన్నగాత్రం మహారణే । భవద్భిశ్శ్వోనిహంతాస్మి రామం లోకస్య పశ్యతః ॥

(2) 6-94-31 అనీకం దశసాహస్రం రథానాం వాతరంహసామ్ । అష్టాదశసహస్రాణి । కుంజరాణాం తరస్వినాం । చతుర్దశసహస్రాణి । సారోహాణాం చ వాజినాం । పూర్ణే శతసహస్రే ద్వే । రాక్షసానాం పదాతినాం । దివసస్యాష్టమే భాగే । శరైరగ్నిశిఖోపమైః । హతాన్యేకేన రామేణ । రక్షసాం కామరూపిణామ్ ॥

హాపార్శ్వులం బిలిచి రథమాయత్తం బొనర్పుఁడని నుడువ వారలటుగావింపఁ జిఱు నవ్వొలయ ఖర కుంభకర్ణ ప్రహస్తేంద్రజిత్తుల మరణమునకుం బరితపించెడు నాదు చిత్తమునకు రామలక్ష్మణులఁ జంపుటచే శాంతిం జేసి [1] నెవరు పతిపుత్రభ్రాతృ నిధనమునకుం గుందెదరో వారల యాస్రప్రమార్జనము (కన్నీరుదుడుచుట) వానరులం జంపి కావింతునని నుడివి మీరలును నాతోడన నరదమునకుం జనుండని చేయునదెద్దియు లేక రాజాజ్ఞానుసారముగ ననువర్తింప నష్టతురగ రథారోహణం బొనర్చి యాతుధానులు,భీమ నాదములం దెసలు చెవుడుపడు నట్లొనర్చుచుఁ దోడనరా రామలక్ష్మణులున్న యెడ కభిముఖముగ నరుదెంచునపు డినుండు [2] నష్టప్రభాయుతుఁడుగఁ గన్పట్ట దిశలు తిమిరావృతంబులుగ న్దోఁపనిట్టి యపశకునంబులంగనియు శంక లేక వనచరులపయింబడి సంకులపుంబోరాటమున దశముఖుఁడు సర్వతోముఖుఁడుగ విజృంభణమొనర్చి వానరులఁ గర్ణనాసోరుబాహు శిరఃకృత్తగాత్రులం గావింప దాడికోర్వమి వానరులందంద జరుగ రథమును రాముపయిం బరపునెడ సుగ్రీవుఁ డడ్డపడి దుర మొనర్ప నంతవిరూపాక్షుండు కదనమునకు రాఁగడతేరుపంబడియె. దశవదనుండదిగని మహోదరునింబురికొల్ప నతండును నాశనమునఁ జంపంబడియె.అంతమహాపార్శ్వుండే తెరనాతని ముష్టికిం బలిగావించి వనచరులు చెలరేఁగుతఱి రావణుండధికరోషారుణితనయనుండగుచు లక్ష్మణునితోఁ బోరాడి విడిచి శ్రీరాముపయిని బాణముల నేయ నతండును శరజాలములఁ బఱపి పరస్పర వధకాంక్షచే దురమునుడుగకయుండుటయు లక్ష్మణుండు సాయమురానతనిని నొంప నంతనె విభీషణుండగ్రజుపయిన బలుశరములం బఱప దశవదనుఁ డతని నదలించి శక్తిని సౌమిత్రిపయిం బనుప నాతఁడు [3] మూర్ఛనొందియుండుతఱి [4] శ్రీరాముఁడు విషాదమునొందియు,[5]నియ్యది కాలంబు కాదని మరలి రావణునొంప నతఁడు పలాయనంబొందె. అంతలక్ష్మణపతనకారణమున విలాపంబొనర్చియు, సుగ్రీవాదులచే నాశ్వాసింపఁబడి యూరకయుండ సుషేణుం డంజనీసూనునకుం బర్వతానయనవిధముం దెలుప నతండు చని గొనితేర యౌషధప్రభావమున లక్ష్మణునితోడ వానరులందఱు నపగతరు

(1) 6-96-18 హతో భర్తా హతో భ్రాతా । యాసాం చ తనయా హతాః । ఏషామద్య కృపోస్త్రాసాం । కరోమ్యస్రప్రమార్జనమ్ ॥

(2) అహారేవ యుద్ధారంభ ఇతి సూచయతి ॥

(3) 6-101-36 తతో రావణవేగేన । సుదూరమవగాఢయా । శక్త్యా నిర్భిన్నహృదయః । పపాత భువి లక్ష్మణః ॥

(4) 37 తదవస్థం సమీపస్థో । లక్ష్మణం ప్రేక్ష్య రాఘవః । భ్రాతృస్నేహాన్మహాతేజా । విషణ్ణహృదయోఽభవత్ ॥

(5) 39 నవిషాదస్య కాలోయ । మితిసంచింత్య రాఘవః । చక్రే సుతుములం యుద్ధం । రావణస్య వధేధృతః ॥

జులై రి. ఆసమయ మమావాస్య పగలిరువదియైదు గడియలు సుమారుండవచ్చునని యోచింపవలయు. [1] తదనంతరము లక్ష్మణాదులతో దివాకరుండ స్తమించుటకుముందుగ నీదురాత్మునివధింపఁ గోరెదనని నుడువ నంతదశముఖుఁడు మరలసమరముఖుఁడై వచ్చుటయు నిరువురకు ఘోరయుద్ధ ముపక్రమముగాఁగ నంతసాయంకాలమున [2] ధరాగతుండగు రామునకును రథగతుండగు రావణునకునుయుద్ధము సరికాదని దేవగంధర్వాదులనుచుండఁ బాకశాసనుఁడు మాతలిం బిలిచి శక్తిశూలధనుర్బాణసహితమగు నారథమును రామవిజయమునకుఁ గొనపొమ్మని నుడువ నతండటులొనర్ప నాయరదమునకుఁ బ్రదక్షిణంబు సలిపి యధిరోహణం బొనర్చిన వెనుక ఘోరతమముగ సంగరమగుటయు నంత రావణునిశక్తి కొంచెము క్షీణముగఁ గన్పట్టసూతుఁడు రథమును వెనుదీయ నంత నతనిపై రావణుఁడు గినిసిరాఘవాభిముఖముగ నరదమును బోఁదోలుమన నటులుసేయ శ్రీరాముఁడపుడు చింతాక్రాంతుండై యుండఁగ దేవఋషిసంఘముతోడ నగస్త్యుఁడేతెంచి [3] యాదిత్యహృదయోపదేశముఁ జేయుసమయమరుణోదయ కాలమని నుడువఁదగు. [4] అనంతరము మాతలి వాక్యమున బ్రహ్మాస్త్రప్రయోగముఁ జేయ [5] లోకవిరావణుఁడగు రావణుఁడు విగతజీవుండై పుడమిపయింబడియె. [6] ఇతనియుద్ధ మనువనదినమున రేయుంబవలుజరగెనని నుడువవలయు. ఉదయానంతరము ధాత్రు సం॥ చైత్ర శు 1 దినమున [7] విభీషణవిలాపమును [8] మం

(1) 6-102-48 అహంతువధమిచ్ఛామి। శీఘ్రమస్యదురాత్మనః। యావద స్తంనయాత్యేష కృతకర్మాదివాకరః ॥

(2) 6-103-5 భూమౌస్థితస్యరామస్య । రథస్థస్యచరక్షసః । నసమంయుద్ధమిత్యాహు । ర్దేవగంధర్వదానవాః ॥

(3) 6-107-6 రశ్మిమంతం సముద్యతం । దేవాసురనమస్కృతమ్ । పూజయస్వవివస్వంతం । భాస్కరంభువనేశ్వరమ్ ॥

(4) 6-111-2 విసృజాస్మైవధాయత్వ । మస్త్రంపైతామహంప్రభో । వినాశకాలఃకథితో । యస్సురైస్సోస్యవర్తతే ॥

(5) 6-111-21 సతాసుర్భీమవేగస్తు । నైఋతేంద్రోమహాద్యుతిః । పపాతస్యందనాద్భూమౌ। వృత్రోవజ్రహతోయథా ॥

(6) 6-110-37 దేవదానవయక్షాణాం । పిశాచోరగరక్షసాం । పశ్యతాంతన్మహాద్యుద్ధం । సర్వరాత్రమవర్తత ॥

(7) 6-112-1 భ్రాతరంనిహతంద్రృష్ట్వా । శయానంరామనిర్జితం । శోకవేగపరీతాత్మా । విలలాపవిభీషణః ॥

(8) 6-114-2 దశగ్రీవంహతంద్రృష్ట్వా । రామేణాద్భుతకర్మణా । పతింమన్డోదరీతత్ర । కృపణాపర్యదేవయత్ ॥

